





# ధర్మము

విచారణ

# టాల్ స్టాయి కథలు-3





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004497

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# టాల్‌స్టాయి కథలు

## మూడవ భాగము

కర్త: టాల్‌స్టాయి

అనువాదకర్త: భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# విషయసూచిక





# కౌంట్ లియో టాల్‌స్టాయ్

**(1828 - 1910)**

టాల్‌స్టాయ్ రష్యాదేశపు ఇటీవలి సారస్వత చరిత్రలో అత్యున్నతమైన ప్రత్యేక స్థానం ఆర్జించుగున్న మహావ్యక్తి. ఆయన జమీందారీ కుటుంబంలో జనించినవాడైనా, సాధారణ యోధుడుగ సేనలో జేరి రణరంగానికి వెళ్లి, సైనికుల యిక్కట్లు స్వానుభవంవల్ల తెలుసుకున్నాడు. ప్రజలయందు ఆయనకు గల సానుభూతీ, సత్యధర్మాలయందు అయనకు గల ఆసక్తీ అయన్ని కలం పట్టించాయి. భౌతికమైన భోగాలకీ ఆధ్యాత్మికమైన ఆశయాలకీ ఆయన హృదయం నిరంతర సంగ్రామ రంగం అయింది. అయన యోచన విప్లవానుగుణం అయినా, ఆయన శక్తి పరిణామవాదపక్షమే. తలపెట్టిన ఉద్యమంలో త్రికరణంగా లీనం అయిపోవడం ఆయన స్వభావం. సకల విధ స్వాతంత్ర్యం అయన లక్ష్యం. భూధనధాన్యాదుల అపరిమిత సేకరణకి అయన ద్వేషి. తన నైతిక లక్ష్యాన్ని చేరుకోగల మార్గాన్ని తన జీవితం నడుపుకోలేకపోతిని గదా అని చివరదాకా అయన బాధపడ్డాడు. తన యావదాస్తీ వదిలేసి తను వానప్రస్థంలో ఉంటూ అయన కర్షక జనానికి తోడ్పడ్డాడు. పైపై జ్ఞానం ఆర్జించి విద్యాధికులం అనుకునేవారి సంకుచితత్వం ఆయన హేళనచేశాడు. అయన ప్రజ్ఞ సర్వతోముఖం. అయన ఎక్కడ చెయివేస్తే అక్కడ చైతన్యం ఉట్టిపడింది. ఆయన సృష్టి అపారం - నవలలు, నాటకాలు, కథలు, చరిత్రలు, విమర్శనలు - అన్నీ చరితార్థం అయినవే. ఆయన శైలి హృదయంగమం.

ఈ సంపుటంలో 23 కథ లున్నాయి. జీవిత సమస్యలలో ఏదో ఒకటి గొప్పది చర్చింపబడని కథ ఏదీ లేదు. ఈ ఇరవైమూడు కథల్నీ నేను పరిమాణ ప్రకారం క్రమపరిచాను. 'ఈ ఇరవైమూడు కథలు మాత్రమే రచించి ఉండీ మరి యితరత్రా యే రచనా టాల్‌స్టాయ్ చేసుండకపోయినా, ఆయన రచనా ప్రసిద్ధి ఇప్పటిలాగే ఉండేది', అని ఒక మహావ్యక్తి చేసిన విమర్శ జ్ఞప్తియం దుంచుగుంటే, ఇవి ఎటువంటి మహిమ గలవో బోధపడుతుంది. ఇందులో ఒక్కొక్కటి, వ్యాసమా, కథా, కథానికా, సామ్యకథా, చరిత్రా, ఆత్మకథా, లేక అన్నింటి సమ్మేళనానా అనిపిస్తుంది.

వీటి ఆంధ్రభాషాంతరీకరణం గురించిన అనుమతికోసం ఢిల్లీలోని 'రష్యన్ ఎంబెసీ' వారిని నేను కోరగానే, వారు అనుమతి ఇచ్చారు. వారిక కృతజ్ఞుణ్ణి.

అ ను వా ద క ర్త.

# టాల్‌స్టాయి కథలు

## మనిషికి ఎంత భూమి అవసరం?

i

ఒక అక్క తన చెల్లెల్ని చూసి రావడానికి పల్లెటి దిక్కుకి వెళ్ళింది. ఆ అక్క పట్నంలో ఒక వర్తకుడి భార్య, చెల్లెలు గ్రామంలో ఒక రైతు పెళ్ళాం. ఇద్దరూ టీ తాగేవేళ, మాటా కబురూ చెప్పుగోడంలో, అక్క నగరజీవితంలో ఉండే మెరుగులు చెప్పడం మొదలెట్టి, అక్కడ తమరు ఎంత హాయిగా జీవిస్తారో, తమ రెంత గొప్పగా వేషంవేస్తారో. పిల్లలు ఎంత ఉలిపిరి దుస్తులు ధరిస్తారో, తమరెంత మంచి దినుసులు తిని తాగుతారో, ప్రదర్శన శాలలకీ విహారాలకీ వినోదాలకీ ఎల్లాఎల్లా తమరు వెడుతూంటారో, ఏకరువెట్టి బడాయి కొట్టింది. చెల్లెలికి కోపంవచ్చి తనవంతు రాగానే వర్తకుడి జీవితం నిరసన జేసేసి, రైతు జీవితం వెనకేసు గొచ్చింది. 'నా జీవిత మార్గం వదులుకుని నీ మార్గంలోకి నేను ఎన్నటికీ మారను. ఉంటే మేం కాస్త మోటుగా ఉండచ్చు, కాని అధమం ఏ చింతా లేకుండా మాత్రం ఉంటాం. మాకంటె నాజూకు ఫక్కీలో మీరు జీవించవచ్చుగాని, అవసరానికి సరిపడడం కంటె ఎక్కువగా మీరు తరుచు ఆర్జించుకో గలిగినా, ఉన్నదంతా పోగొట్టుగోడానికే ఎక్కువ వీళ్ళున్నాయి మీకు. లాభనష్టాలు కవలపిల్లలు — అంటారు విన్లేదూ? ఒకనాడు ఐశ్వర్యంతో తులతూగేవాళ్ళు మర్నాడు తిండికి ముష్టెత్తుగోడం తరుచు జరుగుతూ ఉంటుంది. మా మార్గం క్షేమతరం. రైతు జీవితం కొవ్వెక్కిన రకంగా ఉండకపోయినా దీర్ఘంగా ఉంటుంది.

మేం ఎన్నడూ ధనికులం అవడం అంటూ ఉండదు. కాని తిండికి మా కెప్పుడూ పుష్కలంగా ఉంటుంది' అంది. అందుకు అక్క హేళనగా, 'పుష్కలంగా? మరె, ఎందుకూ, పందులకీ దూడలకీ వాటాలు పెట్టుగోడానికేగా; పోవే! సాంఘిక మర్యాదల్లో ఉండే సొగసు మీ కెక్కడ తెలుస్తుందీ? మీ ఆయన ఎంత చాకిరీట చెయ్యనీ నువ్వు ఇప్పుడెల్లా ఉన్నావో అల్లాగే మరణించాలి—ఏ పెంట కుప్ప మీదో! నీ పిల్లలూ అంతే!' అంది.

మళ్లీ చెల్లెలు అందుకుని, 'సరే, ఏమంటావ్ అందుకూ? మా పని విధాయకంగా మోటు, ముతగ. కాని, మరో దృష్టితో చూస్తే అది అమోఘం, మేం ఎవడికీ సలాములు చెయ్యనవసరం లేదు. కాని, పట్నాల్లో ఉండే మీకు చుట్టూ దురాకర్షణలే. ఈ రోజున అంతా సవ్యంగానే కనపడచ్చు. అయితే రేపు? మహాశని నీ భర్తకి ఏ పేకాటో, ఏ మద్యపానమో, ఏ స్త్రీ సంపర్కమో ఎరచూపించి లాగెయ్యచ్చు. దాన్తో సర్వమూ నాశనం అవుతుంది. అల్లాంటివి తరుచు జరుగుతూండవూ?' అంది.

కాని ప్రహోమా, ఇంటియజమాని. వేడిమిద్దెపైన పడుకుని, ఈ స్త్రీల వాగ్ధోరణి జాగ్రత్తగానే విన్నాడు, విని, 'ఆ మాట పూర్తిగా సత్యం. పసితనం నించీ భూమాతని దున్నుకోడంలో లీనం అయిఉండే రైతులమైన మాకు తలలోకి అవివేకాన్ని ప్రవేశపెట్టుగోడానికి తీరుబడి ఉండదు, మాకు లోటల్లా ఒకటే. ఏమిటదీ అంటే, మాకు సరిపడ భూమిలేదు. నాకే గనక విస్తారం భూమి ఉండి ఉంటే, చివరికి ఆ మహాశని భయంకుడా నాకు లేదు' అనుకున్నాడు.

ఆ స్త్రీలు టీ పానం పూర్తిచేసుకుని, కాస్సేపు దుస్తుల్ని గురించి ముచ్చటించి, టీ పరికరాలు ఎక్కడివక్కడ పెట్టేసి పడుకుని నిద్రించారు.

కాని, మహాశని, ఆ వేడి మిద్దెపక్కనే తనూ కూచుని ఇక్కడ జరిగిన మాటలన్నీ వినేశాడు. చెల్లెలి మాటలవల్ల ఆమె భర్త ప్రహోమా బడాయిలో పడిపోయినందుకున్నా, అతడు తనకే గనక విస్తారం భూమి ఉండి ఉంటే, చివరికి ఆ మహాశని భయంకుడా తనకి లేదు—అనేసి నందుకున్నా, మహాశని చాలా సంతోషిస్తూ, 'అంతా బాగానే ఉంది. మనకి ఒక బడాయి పడుతుంది. నీకు నేను విస్తారం భూమి ఇస్తాను. ఇచ్చి ఆ భూమి మూలంగానే, నిన్ను నా వశం చేసుకుంటాను,' అనుకున్నాడు.

ii

ఆ గ్రామానికి చేరువులోనే ఒక గొప్పావిడ ఉంటోంది. ఆవిడ మూడువందలఎకరాల ఎస్టేటుకి పిల్లజమీందారిణి. చిరకాలం ఆవిడ రైతులందరితోటీ ఎంతో సఖ్యంగా ఉండేది. కాని, తన నిర్వాహకుడుగా ఒక ముసిలి సిపాయిని పెట్టుకోగానే, వాడు జనానికి జరిమానాలు వేసి దిగలాగడం మొదలెట్టాడు. ప్రహోమా ఎంత జాగర్తగాఉండడానికి యత్నిస్తేం, అతడిగుర్రం ఏదోవెళ్ళి ఆవిడ ఉలవ చేలో పడడమో, అతడి ఆవేదో వెళ్ళి ఆవిడ తోటలో తచ్చాడడమో, అతడి దూడలేవోవెళ్ళి ఆవిడ పచ్చికబీళ్ళలోకి దారి చేసుగోడమో, మళ్ళీ మళ్ళీ జరుగుతూండడంవల్ల, అతడు నిత్యమూ జరిమానాలు చెల్లగట్టవలి సొచ్చేది. ఎంజేస్తాడూ? చెల్లించేసేవాడు, పాపం! కాని లోపల తిట్టుగునేవాడు. ఇంటికి

మహా చెడ్డ 'పెంపరు' గా వెళ్ళేవాడు, ఇంట్లోవాళ్ళమీద విసుర్లు మనేవాడు. వేసంకాలం పొడుగుతా ఆ నిర్వాహకుడిమూలంగా ప్రహారీమా చాలా చిక్కుపడ్డారు. కాని, శీతకాలం రాగానే అతనికి బాధ అనిపించడం బదులు పశువుల్ని సాలల్లో పెట్టేశాం గదా బాబూ అని సంతోషంకూడా వేసింది. అవి పచ్చిక బీటికి వెళ్ళి తేరగా మేసొస్తే తీరిపోయేదానికి నిలవమేత వాటికి వెయ్యా వలి సొచ్చినందుకు అతడు సణుక్కున్నా, అధమం వాటిని గురించిన ఆందోళనమాత్రం అతనికి విరగడైంది.

శీతకాలంలో వదంతి బయల్దేరింది! ఆ జమీందారిణి తన భూమి అమ్మేస్తుందిట, హైరోడ్డున ఉన్న హోటలు యజమాని దాన్నిగురించి బేరాలు చేస్తున్నాడట—అని. ఈ సంగతి రైతులు విని ఎంతో కంగారుపడుతూ, 'ఇంకేముందీ? హోటలు యజ మానే గనక ఈ భూమికొనేస్తే, ఆవిడ నిర్వాహకుడు వేసిన జరి మానాలకంటె జోరుగా జరిమానాలు తగిలించి మన్ని బాధించే స్తాడు. ఈ భూమి ఒక్కటె ఆధారం మనందరికీ,' అని అను కున్నారు. అప్పుడు వాళ్ళు తమ 'ప్రజాసంఘం' తరఫున ఆవిణ్ణి కలుసుగుని, హోటలు యజమానికి ఆ భూమి అమ్మవద్దని ఆవిణ్ణి కోరుతూ, అత డిచ్చేకంటె ఎక్కువధర తమరే ఇయ్యా జూపారు. ఆవిడ అల్లానే కానీండి, అంది. ఆ భూమిమీద అంద రికీ ఉమ్మడి హక్కు ఉండేలాగ, ఎస్టేటు యావత్తూ ప్రజా సంఘమే సమిష్టిగా కొంటూన్నట్టు ఏర్పాట్లు చెయ్యడానికి ఆ రైతులు యత్నించారు. వాళ్ళంతా రెండుసార్లు సమావేశమై సంప్రతించుగున్నారు, కాని వ్యాపారం పైసలు చేసుగోలేక

పోయారు. మహాశని వచ్చి వాళ్ళల్లో వైషమ్యబీజాలు చల్లడం వల్ల, వాళ్ళు ఏకాభిప్రాయానికి రాలేకపోయారు. చివరికి, ఎవడి ఉపాధినిబట్టి వాడు, వ్యష్టిగానే ఆ భూమి కొనుక్కోగలందుకు వాళ్ళు నిశ్చయానికి వచ్చారు. జమీందారిణీ, ఈ పద్ధతికీ అంగీకరించింది, ఆ పద్ధతికి అంగీకరించినట్టే.

వెంటనే ప్రహోమా ఓ సంగతి విన్నాడు—తన పక్కవాడోడు ఒక యాభై ఎకరాలు కొనేస్తున్నాడనిన్నీ, సగం ధర రొఖ్ఖంగా చెల్లిస్తూ తక్కింది సంవత్సరానంతరం అతడు చెల్లగట్టే షరతుకి జమీందారిణి అనుమతించిందనీనీ. ప్రహోమాకి చుప్పనాతి బుద్ధిపుట్టీ, 'చూడెల్లా వచ్చిందో! ఈ భూమి యావత్తూ అమ్మేతున్నారూ! అటువంటప్పుడుకుడా అందులో కాస్తైనా నేను ఆర్జించకుండా ఉండడమా!' అనుకుని, భార్యనిపిల్చి ఆమెతో, 'చూడూ. వాళ్ళూ వాళ్ళూ నేల కొనేస్తున్నారు. ఓ ఇరవై ఎకరాల ప్రాప్తికేనా మనమూకొని తీరాలి. జీవితం కేవలం దుర్భరం అవుతోంది. జరిమానాలేసి, ఆ నిర్వాహకుడు మన్ని ఇల్లా ఊరికే రాచి పారేస్తున్నాడు' అన్నాడు. వాళ్ళిద్దరూ కలిసి సంప్రతించుగుంటూ కొంతనేలేనా కొనగలగడం ఎట్లానా అని ఆలోచించారు. వెనకేసిన సొమ్ము ఓనంద ఉంది. ఒక గుర్రప్పిల్లని సగం తేనెటీగల్ని అమ్మేశారు. కొడుకుల్లో ఒకణ్ణి పాలేరుగా కుదిర్చి వాడి కూలి సంచకరువుగా పుచ్చేసుగున్నారు. లోతక్కువ ఒక బావగారి దగ్గిర పుచ్చుగుని, కొనుధర సొమ్ములో సగం ఎల్లాగో గోకి పోగుచేశారు. కొంత అడివితో కుడా ఉన్న ఓ నలభై ఎకరాల ఖండం కొనాలని సంకల్పించు

గున్నారు. వెంటనే ప్రహోమా అది బేరం చేసు కావడానికి జమీందారిణి దగ్గిరికి వెళ్ళాడు. ఒప్పందం అయింది. అందుకు కరకంపనంకూడా చేసుగున్నారు. కొంత సొమ్ము ముందుగానే అతడు ఆవిడ అధీనంలో పెట్టాడు. పట్నం వెళ్ళారు. పత్రాలు సంతకం చేసుగున్నారు—అతడు తక్షణం సగం ధర నగదుగా ఇచ్చెయ్యడానికీ, తక్కిన సగమూ రెండేళ్ళలోపల చెల్లగట్టగల పూచీ పడడానికీనూ.

ఇక్కడికి ప్రహోమా స్వంత భూమి అనేది చూడగలవాడయాడు. విత్తులు బదులుచ్చుగుని ఆ భూమి అతడు ఊడ్చాడు. మంచిపంట పండింది. సంవత్సరంలోపలే జమీందారిణికీ తన బావగారికీ కుడా బాకీ మొత్తాలు అతడు చెల్లగట్టి పారెయ్యగలిగాడు. దాన్తో అతడు రూఢిగాభూమి ఖామందు అయాడు. స్వంతభూమే దున్ని ఊడ్చుగున్నాడు, స్వంతభూమి మీదే గడ్డిపైరువేశాడు, తన అడివిలోనే చెట్లు కొట్టుగున్నాడు, తన పచ్చిక బీళ్ళలోనే తన పశువుల్ని మేపుగున్నాడు. దున్నడానికి గాని ఎదుగుతూన్న చేలు చూడ్డానికి గాని పొలాలకి వెళ్ళినప్పుడూ పచ్చిక ఎల్లా ఉందో అని బీళ్ళకి వెళ్ళినప్పుడూ అతనికి అమితానందం వేసేది. తన భూమిమీద పెరిగిన గడ్డీ తన భూమి మీద వికసించిన పువ్వులూ తక్కినచోట్ల వాటికంటె వేరుగా ఉంటూన్నట్టు అతనికి కనపడేవి. పూర్వం ఆ భూమి పక్కనించి నడిచి పోతూంటే అతనికి అన్ని భూములులాగే అదీ ఉండేది. కాని, ఇప్పుడు! మరొకమోస్తరుగా ఉన్నట్టుంది.

## iii

ప్రహోమా చాలా తృప్తి పడ్డాడు. ప్రతీదీ నిక్షేపంలా ఉండేదే. అల్లా ఎక్కడ ఉండనిస్తారూ! పక్కరైతులు ఇతని ఊడుపుపొలాల్లోకీ పచ్చిక బీళ్ళలోకీ దురాక్రమణలు మొదలెట్టారు. అతడు ఎంతో మర్యాదగా వాళ్ళకి విన్నవించుతోచ్చాడు. కాని, వాళ్ళు అల్లా చేస్తూనే ఉన్నారు. ఒకప్పుడు 'ప్రజాసంఘం' తాలూకు పశువులకాపరి నిర్లక్ష్యంవల్ల ఉమ్మడి గోవు లెళ్ళి ఇతని బీళ్ళలో పడేవి. మరొకప్పుడు రాత్రిమేతకి వెళ్ళిన గుర్రాలొచ్చి ఇతని చేలో పడేవి. ప్రహోమా వాటిని విసుగులేకుండా మళ్ళేస్తూండేవాడు, యజమానుల్ని క్షమించేసి ఊరుకుంటూండేవాడు, అంతే. అల్లా ఎవణ్ణీ కోర్టుకి ఈడవకుండా ఎంతోకాలం వరకూ అతడు వెనక్కి తగ్గాడు. కాని చిట్టచివరికి బాగా విసిగేసిపోయి, అతడు జిల్లాకోర్టులో ఒక ఫిర్యాదు దాఖలుచేశాడు. ఈ చిక్కుకి కారణం రైతులికి భూమిలేకపోవడమే కాని వాళ్ళ మనస్సుల్లోని దురుద్దేశం కాదని అతడెరుగును. ఎరుగుంటేం? నే నిల్లాగే నిర్లక్ష్యం చేస్తూ మరి ఊరుకోలేను. ఊరుకుంటానా, నాకున్నదంతా వాళ్ళు ధ్వంసం చేస్తారు. వీళ్ళకి బాగా పాఠం చెప్పించి తీరాలి,' అనుకున్నాడు.

వాళ్ళనిపట్టి ఋజువు చెయించి, అతడు వాళ్ళకి ఒక పాఠం నేర్పించాడు, తరవాత మళ్ళీ నేర్పించాడు. రైతుల్లో ఇద్దరి ముగ్గురికి జరిమానాలు పడ్డాయి. అందుచేత ప్రహోమాఇరుగు పొరుగు అతని మీద పగపట్టి, అతని పొలంలోకి పశువుల్ని తోలాలనే అప్పుడప్పుడు తోలుతోచ్చారు. అసలు ఒకరైతు ప్రహోమా

అడివిలో ఒక రాత్రి ప్రవేశించి, బెరళ్ళకోసం అయిదు నిమ్మ చెట్లు తెగనరికాడు. ఒకనాడు ప్రహోమా తన అడివిలో వెడుతూంటే దూరంగా ఏదో తెల్లగా పడుండడం గమనించాడు. అతడు దగ్గిరికి వెళ్ళి చూశాడు. బెరడు ఒల్చిన మాన్లు నేలమీద ఉన్నాయి. అక్కడే పక్కగా చెట్లబదులు మోళ్లున్నాయి. 'అసలు అక్కడోటీ అక్కడోటీ చెట్లు కొట్టడమే మిక్కిలి పాడు పని. అల్లాంటిది ఆ దిక్కుమాల్నివాడు ఒక గుంపునే నరికేశాడే! ఈ నరికిన వాడెవడో నాకు దొరికితేనా, వాడికి తగ్గశాస్తి చేసేస్తాను' అని అతడనుకున్నాడు, వాడెవడై యుంటాడా అని బుర్ర చించుగున్నాడు. చివరకి నిశ్చయించుగుని, 'సీమోను అయుండి తీరాలి. మరోడికి తరం గాదిది' అనుకుని. సీమోను ఇంటిపట్టు చూసిరావడానికి అతడు వెళ్ళాడు. అక్కడ ఏమీ ఆనుచిక్కలేదు, కోపప్రదర్శనంమాత్రం జరిగింది, అయితేం, సీమోనే ఆ పని చేసుంటాడని అతడికి మరీ రూఢిగా అనిపించడంవల్ల, సీమోను మీద అతడు ఫిర్యాదు దాఖలు చేశాడు. సీమోనుని రప్పించి, తగాదా విచారణచేశారు, మళ్లీ ఇంకా విచారణ చేశారు. కాని అంతా అయిన తరవాత. సీమోను మీద ప్రతికూల సాక్ష్యం ఏమీ లేకపోవడంవల్ల సీమోనుని విముక్తుణ్ణి చేశారు, ప్రహోమా బాధ హెచ్చిపోయింది, అతడు తన కప్పుడు వచ్చిన కోపాన్ని అక్కడి కోర్టుపెద్ద మీదకీ న్యాయమూర్తులు మీదకీ మళ్ళేశాడు. 'దొంగలు మీకు బాగా చెయిఒడి చేస్తూంటే మీరు ఒప్పుగుంటారు. మీ మట్టుకి మీరేనా నిజాయితీ మనుషుల యుంటే, అ దొంగని అల్లా దులుపుగు చక్కా పోనిస్తారా'

అన్నాడు. అల్లాగ్గా అతడు అటు న్యాయమూర్తుల తోటీ ఇటు పక్కవాళ్ళతోటీ కుడా కజ్జా ఆడాడు. అతని యిల్లు తగలపెడతా రనే బెదిరింపులు చెలరేగడం మొదలెట్టాయి. అందుకని ప్రహోమాకి భూమి ఎక్కువైందన్న మాటేగాని, ప్రజా సంఘంలో అతని స్థానం చాలా నీచపడి పోయింది.

ఆ సమయంలో, చాలామంధి ఏదో కొత్తప్రాంతానికి కాపరా లెత్తేసి వెళ్ళి పోతూన్నట్టు పుకార్లు బయల్దేరాయి. కాని, ప్రహోమా 'నా భూమి వదిలి వెళ్ళవలిసిన అగత్యం నా కేమీ లేదు. కాని, తక్కిన వాళ్ళల్లో ఎవరేనా ఈ గ్రామం విడిచి వెళ్ళచ్చు. వెళ్ళనీ, మరీనయం, మనికి మరీ ఖాళీగా ఉంటుంది. ఆ లేచి వెళ్ళినవాళ్ళ భూములుకుడా నా పరమే చేసుగుని, నా జమీ మరికాస్త పెద్దది చేసేస్తాను. అప్పుడు నేను మరి కొంచెం హాయిగా జీవించవచ్చు. ప్రస్తుతస్థితిలో, నేను మరీ ఇరకాట పడిపోతున్నాను, సుఖంగాఉందామంటే.' అనుకున్నాడు. ఒకనాడు ప్రహోమా యింటిదగ్గిరే కూచుని ఉండగా, ఒక రైతు ఆ గ్రామం మీదుగా పోతూ అతనింటికి రావడం తటస్థించింది. ఆ రాత్రి అతణ్ణి అక్కడ ఆగనిచ్చి, భోజనం పెట్టారు. ప్రహోమా ఆ రైతుతో మాట్లాడుతూ అతని రాక ఎక్కణ్ణించో వాకబుచేశాడు. వోల్గాకి అద్దరిని ఎక్కడో దూరాన్నించి తను వస్తున్నాననీ, అక్కడ తనకి పననీ, ఆ కొత్తవాడు చెప్పాడు. తరవాత, మాటమీద మాటొచ్చి, ఆ మనిషి, తన ప్రాంతాలకి అనేకజనం వచ్చి స్థిరపడుతూన్న వయినం యావత్తూ చెప్పుగు వచ్చాడు. తన స్వగ్రామంవాళ్ళే కొందరు అ ప్రాంతాలలో

స్థావరం ఎల్లా ఏర్పరుచుగున్నారో కుడా చెప్పాడు. వాళ్ళు వెళ్ళి అక్కడి ప్రజాసంఘంలో చేరగానే, మనిషికి పాతిగేసి ఎకరాల చొప్పున మంజూరైందన్నాడు. మరి ఆ భూమి ఎంత మంచిదంటే, దానిమీద చల్లిన రాగి ఓ గుర్రం ఎత్తున చేస్తుందనీ, ఆ మొక్క ఎంతలావంటే కొడవలి దెబ్బలు ఐదుకొడితేగాని ఒక కంకి రాదనీ, అన్నాడు. ఒక రైతు ఆ ప్రాంతానికి ఏమీ తీసిగెళ్ళకుండా చేతులు ఝాడించుగుంటూ వచ్చాడనీ, అయినా ఇప్పుడు వాడి స్వంతానికి ఆరుగుర్రాలూ రెండావులూ ఉన్నాయనీ చెప్పాడు. ప్రహోమా హృదయంలో కోరిక రగిలింది. అతడు, 'మరోచోట ఎంతోహాయిగా బతగడానికి వీలున్నప్పుడు, ఈ ఇరుకు కన్నంలో నే నెందుకు మగ్గిపోవాలీ? ఇక్కడ నాభూమీ నాఇంటిపట్టూ అమ్మిపారేసి, ఆ సొమ్ముతో అక్కడికెక్కడికో వెళ్ళిపోయి నూతనప్రారంభం చేస్తాను, అవసర వస్తువులు కొత్తవే కొనేసుగుంటాను. కాని, మొదట నే నక్కడికి వెళ్ళి, అక్కడి పరిస్థితి అంతా స్వయంగా కనిపెట్టి రావాలి' అనుకున్నాడు.

అతడు ఆ వేసంగిలో అంతా సిద్ధంచేసుగుని బయల్దేరాడు. వోల్గామీద దిగువకి స్టీమరుమీద సమారా వెళ్ళి, అక్కణ్ణించి మూడువందలమైళ్ళు కాలినడకని వెళ్ళి ఎల్లాగో మొట్టుకి అతడు ఆచోటు చేరాడు, తనింటికి వచ్చిన కొత్తవాడు చెప్పినట్టేఉంది, సరిగ్గా. రైతులకి బోలెడంత భూమి. ఏమంటే, ప్రజాసంఘం ఒక్కొక్కడికి పాతిగేసి ఎకరాలు స్వంత ఉపయోగానికి ఇస్తారు. ఇదీకాక, డబ్బున్నవాళ్ళు ఎకరానికి రెండురూకలచొప్పున ఇచ్చి

తమకి కావలిసినంత, మంచిభూమి పన్నులేనిది కొనుక్కో-వచ్చును.

కనుక్కో-దలిచిందంతా కనుక్కు-ని ప్రహోమా ఇంటికి వచ్చేశాడు ఆకురాలు కాలం రాగానే తనకున్నవన్నీ అమ్మడం మొదలెట్టాడు. భూమి లాభసాటిగానే అమ్మేశాడు, ఇంటిపట్టూ పశువుల్నీకుడా సొమ్ముకి ఇచ్చేశాడు. ప్రజాసంఘ సభ్యత్వం ఉపసంహరించుగున్నాడు. వసంతకార్తిదాకా ఆగి, సకుటుంబంగా, కొత్తస్థావరం చేరడానికి, బయల్దేరాడు.

iv

ప్రహోమా కుటుంబమూ తమ కొత్త నివాసస్థలం చేరుకోగానే, ఒక పెద్ద గ్రామానికి చెందిన ప్రజాసంఘంలో సభ్యుడుగా ప్రవేశించడానికి అతడు దరఖాస్తు పెట్టాడు. సంఘపెద్దలకి విందుచేసి, అవసరమైన పత్రాలన్నీ పొందాడు. సంఘపరంగా ఉండే భూమిలో అయిదువాటాలు, అనగా నూటఇరవై అయిదు ఎకరాలు, అతనికీ కొడుకులకీ స్వోపయోగం నిమిత్తం—అంతా ఒకేచోట కాకుండా అయిదు వేర్వేరు ఖండాల్లో—ఇచ్చారు. అదిగాక, సంఘపరమైన పచ్చికబీడు వాళ్ళు వాడుకోవచ్చు. ప్రహోమా తనకి అవసరమైన ఇళ్ళు లేవదీశాడు, పశువుల్ని కొనేశాడు. సంఘం ఇచ్చిన భూమే మూడురెట్లుంది, తన వెనకటి నివాసంలోదానికి. పైపెచ్చు, ఇదంతాకుడా మంచి పైరుభూమి. అతనిస్థితి వెనకటిస్థితికి దశగుణంగాఉంది. అతనికి బోలెడంత దున్నతగ్గ భూమి ఉంది, బోలెడంత పచ్చికబీడుంది. తన చిత్తం వచ్చినన్ని పశువుల్ని అతడు పెట్టుకోగలడు,

మొట్టమొదట, ఇళ్లు కట్టుగోడమూ స్థిరపడడమూ హడా విడిలో, ప్రహోమాకి అదంతా సంతోషదాయకంగా ఉంది. కాని, జీవితానికి ఒకవిధమైన మామూలు ఏర్పడగానే, ఈ స్థితిలోకుడా తనకి భూమి ఇంకా సరిపడా లేదనే అతడు అనుకోడం మొదలెట్టాడు. తన వాటాకివచ్చిన 'సంఘంభూమి' మీద అతడు, మొదటియేడు, గోధుమ వేశాడు, బాగాపండింది. అతడు గోధుమే మళ్ళీ తెగవేసేద్దాం అనుకున్నాడు, గాని ఆపనిచెయ్యడానికి వీలున్న 'సంఘంభూమి' ఆట్టేలేదు, పైగా, తను గోధుమ పంటకి వాడేసినభూమి, మళ్ళీ వెంటనే గోధుమ పంటకి స్వాధీన పడదు. ఏమంటే, ఆప్రాంతంలో గోధుమ వేస్తే తొలిసాగు నేలమీద వెయ్యాలి, లేకపోతే బీడెట్టిన నేలమీద వెయ్యాలి. అందుకని గోధుమ ఒకటిరెండు సంవత్సరాలువేసి, అవురుగడ్డి తెగపెరిగిపోయేదాకా భూమిని బీడెట్టేస్తారు. అల్లాంటిభూమి కోరేవాళ్ళు చాలామంది ఉండేవారు, అందరికీ సరిపడ అటువంటి భూమి ఉండేదికాదు. అందుకని అటువంటిభూమికోసం జనం కాట్లాడుకునేవారు. అటువంటిభూమి ధనికులు కోరడం ఎందుకంటే గోధుమ వేసుగోడానికి, పేదలు కోరడం ఎందుకంటే, ఎవరికేనా వ్యాపారస్థులకి తాత్కాలికంగా యిచ్చి సొమ్ముచేసుగుని, అదెట్టి పన్నులు చెల్లించుగోవచ్చని. ప్రహోమాకి ఏవిధం చేతనైనా గోధుమే వెయ్యాలని పుట్టడంచేత ఒక వ్యాపారస్థుడి దగ్గిర అటువంటిభూమి ఒక సంవత్సరానికి కౌలుకి తీసుగున్నాడు. చాలాగోధుమ వేశాడు. పైరు బాగాలేచింది, కాని ఆభూమి గ్రామానికి విశేషదూరాన్ని ఉండడంవల్ల గోధుమ పంట ఓ పదిమైళ్ళ సుమారు బండిమీద తెచ్చుగోవలి సొచ్చింది.

కొంతకాలానికి, ప్రహోమ్ ఒక సంగతి గమనించాడు—కొందరు రైతు వ్యాపారస్థులు ప్రత్యేక మాన్యాలమీద జీవించడమే కాక ధనార్జన కుడా చేస్తున్నారు—అని. అప్పు డతడు, పన్నులేని భూమి కొంత నేను కొనేసి, దానిమీదే ఒక ఇంటి పట్టు కట్టుగుంటే, !—పూర్తిగా ఆ దారేవేరు. అప్పుడు సర్వమూ కుడా లక్షణంగానూ ఇమిడికగానూ ఉంటుంది' అనుకున్నాడు. పన్నులేనిభూమి కొనేసెయ్యాలనే విషయం అతనికి మళ్లీమళ్లీ జ్ఞాపకం వస్తూనే ఉండేది.

భూమి కౌలుకి తీసుగుంటూ అందులో గోధుమవేస్తూ అతడు మూడు సంవత్సరాలు గడిపాడు. కార్తులు అనుకున్నట్టు జరిగాయి, పంటలు బాగున్నాయి, అతడు సొమ్ము వెనకెయ్యడం మొదలెట్టాడు, అంతటితో తృప్తిబడి అతడు జీవించుగుంటూ పోవలసిందే, కాని ఏటేటా భూమి ఇతరుల దగ్గిర కౌలుకి తీసుగోవలిసి రావడమూ అది తనకి దొరికే దాకా దానికోసం పాకులాడిపోవలసిరావడమూ ఆలోచిస్తే అతనికి విసిగెత్తిపోయింది, మంచి భూమి, అటువంటిది, అమ్మకం అవుతుందిట అని తెలియగానే రైతులు దానికోసం ఎగడివెళ్ళి ఎంతకేనా సరే అది కొనేసేవారు, అందుకని ఎంతో మెళుకువ ఉన్నవాళ్ళకి తప్ప అటువంటిది దక్కేదేకాదు. మూడో సంవత్సరంలో అతడూ ఒక వ్యాపారస్థుడూ కలిసి, కొందరు రైతుల దగ్గిర కొంత పచ్చికనేల కౌలుకి తీసుగోడం తటస్థించింది, అది వాళ్లు దున్నెయ్యడం కుడా పూర్తి అయిం తరవాత. దాన్ని గురించిన పేచీ యేదో బయల్దేరగా, రైతులు కోర్టుకి వెళ్ళారు. తరతవా

ఏమేమి జరిగితేం, అతని శ్రమ వృథా అయి పోయింది. అప్పుడు ప్రహోమా, 'ఇదే నా స్వంతభూమి అయుంటే, నేను స్వతంత్రంగా ఉండి ఉందునుగదా, ఈ రభస వచ్చుండకనే పోనుగదా,' అనుకున్నాడు. అక్కణ్ణించి ప్రహోమా అమ్మకాని కున్న భూములకోసం వెతగడంమొదలెట్టాడు. అతడికి ఒక రైతు తటస్థించాడు. ఆ రైతు లోగడ పదమూడువందల ఎకరాలుకొని, ఎవో చిక్కుల్లోపడి, ఇప్పుడు అయినకాడికి తెగ నమ్మెయ్య దల్చుగున్నట్టు చెప్పాడు. ప్రహోమా వాడితో బేరమాడి వాణ్ణి కిందెట్టి మీదెట్టి చివరికి ఎల్లాగైతేం పదిహేనువందల రూకలకి ధరస్థిరపరిచి, పగం నగదుగానూ తక్కినసగం తరవాత చెల్లించే లాగూ ఒప్పదం అయాడు. మరి వ్యవహారం బందోబస్తు అయి పోతుందనగా, దారినిపోయే వ్యాపారస్థు డొకడు ప్రహోమా ఇంటి దగ్గిర గుర్రాల మేతగురించి ఒకనాడు ఆగాడు. అతడూ ప్రహోమా టీ పీలుస్తూ ప్రసంగించుగున్నారు, ఆ వ్యాపారస్థుడు తను చాలా దూరప్రాంతమైన బష్కీర్ల దేశాన్నించి వెనక్కి వస్తూన్నట్టున్నూ, అక్కడ తను ఓ పదమూడువేల ఎకరాల భూమి ఇంతాచేసి ఓ వెయ్యి రూకలకి కొనేసి నట్టున్నూ చెప్పు గొచ్చాడు. ప్రహోమా ప్రశ్నమీద ప్రశ్న వెయ్యగా, ఆ వర్తకుడు. 'అక్కడికి వెళ్ళి చెయ్యవలిసిన పనంతా ఏమిటంటే, ఆ నాయకులతో స్నేహం చేసుగోడమే. నేను వెళ్ళి ఓ వందరూకల కిమ్మతుచేసే పట్టుదుస్తులూ తివాసీలూ, అవికాక ఒక 'టీ' డబ్బా, మద్యం తాగేవాళ్ళకి మద్యమూ ఇచ్చేశాను. అందుకని ఆ భూమి నాకు ఎకరం ఒక అణా చొప్పున కిట్టింది.

అని చెప్పి, ప్రహోమాకి తన హక్కుపత్రా లన్నీ చూపించి, 'ఆ భూమి ఒక నదిని ఆని ఉండడంవల్ల, ఆ పచ్చికనేల యావత్తూ తొలిసాగు నేలే:' అన్నాడు. ప్రహోమా అతనిమీద మళ్లీ ప్రశ్న పరంపర కురిపించగా, ఆ వర్తకుడు, 'అక్కడ అంతా భూమే. మీరు ఒక సంవత్సరంపాటు అందులో నడిచినా అది ఇంకా ఉంటుంది. అదంతా బష్కీర్లదే, వాళ్ళు గొర్రెలవంటి సాధు జంతువులు. అసలు వాళ్ళ దగ్గిర్నుంచి భూమి ఊరికే కుడా సంపాదించవచ్చు,' అన్నాడు.

ప్రహోమా, 'ఇహనేమ్మరీ! అల్లాంటప్పుడు నేను నా వెయ్యి రూకలూ పెట్టి పదమూడువందల ఎకరాలు మాత్రమే కొనుక్కుని, పై పెచ్చు ఓబుణాన్ని పీ పెక్కించుకోడం ఎందుకూ? ఈ సొమ్ముతోటే భూమి అక్కడ కొంటినా, ఇక్కడి భూమికి పదిరెట్లు మించిన భూమి అక్కడ వస్తుంది.' అనుకున్నాడు.

V

ప్రహోమా ఆ స్థలానికి వెళ్ళడానికి దారి గురించిన వయినం వాకబుచేసి తెలుసుగుని, ఆ వర్తకుడు వెళ్ళిపోగానే, ఆ స్థలానికి తనే వెళ్ళడానికి ఆయత్తపడ్డాడు. ఇంటి వ్యవహారం అంతా భార్యని చూసుగోమని, ఒక నౌఖర్ని కూడాతీసుగుని అతడు బయల్దేరాడు. దార్లో ఒక పట్నంలో కొంచెం ఆగి, ఆ వర్తకుడిచ్చిన సలహాప్రకారం, ఒక టీ డబ్బా, కొంచెం మద్యమూ, ఇతర కానుకలూ అతడుకొన్నాడు. వాళ్ళు ఆ వెళ్ళడం వెళ్ళడం మూడువందల మైళ్ళు వెళ్ళి, ఏడోనాడు ఆ బష్కీర్లు డేరాలువేసుగుని ఉన్న చోటు చేరారు. అంతా ఆ వర్తకుడు చెప్పినట్టే ఉంది.

ఆజనం ఆ పచ్చికబయళ్ళలో ఆ నది గట్టున అల్లిక ఉన్నికప్పుల డేరాలలో ఉన్నారు. వాళ్ళు భూమి దున్నాదున్నరు, రొట్టే తినా తినరు. వాళ్ల పశువులూ గుర్రాలూ మందలకి మందలు ఆ పచ్చిక బయళ్ళలో మేస్తాయి. గుర్రప్పిల్లల్ని డేరాల వెనకాల తాళ్ళెట్టి కట్టిపెడతారు. గోడిగల్ని రోజుకి రెండుసార్లు వాటి దగ్గిరికి తోల్తారు. గోడిగల్ని పితిగి ఆ పాలతో 'కూమిస్' అనే మద్యం చేస్తారు. ఆడవాళ్ళే ఆ మద్యమూ వండుతారు, జున్నూ తయారు చేస్తారు. మరి పురుషులు ఎందెందులో కలగజేసుకుంటారు అంటే, మద్యమూ టీ పీలుస్తూంటారు మాంసం తింటూంటారు బూరాలు వాయించుగుంటూంటారు. వాళ్ళతాపత్రయం యావత్తూ ఇంతే. అంతా దృఢంగా ఖుషీగా ఉన్నారు. వేసంగి మొత్తానికి ఏరోజునాకుడా పనిచెయ్యాలనే ఆలోచనే వాళ్ళకి తట్టలేదు. వాళ్ళు చాలా అజ్ఞానులు. వాళ్ళకి రష్యను భాషరాదు. కాని వాళ్ళని మంచి స్వభావం గలవాళ్ళే అనాలి.

వాళ్ళు ప్రహోమాని చూసిన వెంటనే, డేరాల్లోంచి పైకొచ్చి తమర్ని చూడొచ్చిన వాణ్ణి చుట్టేశారు. దుబాసీగా ఒకణ్ణిపెట్టారు. తను కొంత భూమి గురించి వచ్చినట్టు ప్రహోమా చెప్పాడు. ఆ బష్కీర్లు చాలా ఆనందిస్తూన్నట్టు కనపడ్డారు. వాళ్ళు ప్రహోమాని తీసుగుని ఉత్తమం అయిన డేరాల్లో ఒక దాల్లోకి ఆతణ్ణి నడిపించుగువెళ్ళి, తివాసీలమీద పరిచిన తూలికాతల్పాలమీద అతణ్ణి కూచోపెట్టి, చుట్టూ తమరు కూచున్నారు. వాళ్ల అతనికి టీ యిచ్చి మద్యం యిచ్చి, గొర్రెని చంపించి తినడానికి మాంసం తెచ్చి ఉంచారు. ప్రహోమా తన బండిలోంచి కానుకలు పైకి

తీసి ఆ బష్కీర్లకి తలోటీ యిచ్చాడు, తెచ్చిన టీ కొంత వాళ్ళకి పంచిపెట్టాడు. బష్కీర్లు ఆనందపడ్డారు. వాళ్ళు తమలో తమరు బోలెడంత మాట్లాడుకుని, అనువాదం చెయ్యి అని దుబాసీని కోరారు. అప్పుడు దుబాసీ, 'వీళ్ళు నీతో ఏమని చెప్పాలనుకున్నారంటే: నువ్వు మాకు నచ్చావు. అతిథిని తృప్తిపరచడానికి చాయశక్తులాపని చెయ్యడమూ అతడు తెచ్చి యిచ్చిన కానుకలకి తుల్యంగా వెనక్కి ముట్ట చెప్పడమూ మాకు ఆచారం. నువ్వు కానుకలు తెచ్చి మాకిచ్చావుగనక. తక్షణం చెప్పు, మాకున్న వాటిలో వేటిమీద నీ కెక్కువ మోజు ఉందో: అవి నీకు కానుకగా ఇస్తాం,—అని' అన్నాడు.

అందుకు ప్రహోమా. 'ఇక్కడ నాకు మిక్కిలి ఎక్కువ మోజు దేనిమీదంటే, మీ భూమిమీద. మా భూమి చాలా ఇరకాటం, పైగా నిస్సారం, కాని ఇక్కడి మీ భూమి అతి విశాలం, చాలా సారవంతం. ఇల్లాంటి భూమి నే నెన్నడూ చూడలేదు' అన్నాడు.

ఈమాటలు దుబాసీ అనువదించాడు. బష్కీర్లు కొంతసేపు తమలో తమరు మాట్లాడుకున్నారు. వాళ్ల ఏమి చెప్పుగుంటున్నారో ప్రహోమాకి తెలియలేదుగాని, తన కోరిక వినేసరికి వాళ్ళకి నవ్వొచ్చినట్టు వాళ్ల అరుస్తూ నవ్వడం సాగించారు. తరవాత వాళ్ల మౌనం వహించి ప్రహోమాకేసి చూస్తూ ఉన్నారు. అనువాదకుడు, 'వీళ్ల నీతో చెప్పాలని కోరేదేమిటంటే: నువు తెచ్చి యిచ్చిన కానుకలకి ప్రతిఫలంగా, మేం, చాలా సంతోషపూర్వకంగా నీ చిత్తంవచ్చినంత భూమి నీ కిస్తాం. మరేంలేదు.

నువ్వు ఇదుగో ఇక్కణ్ణించి ఇక్కడి దాకా అని నీ చేత్తో చూపించాలి. చూపించడం తడువు, ఆభూమి యావత్తూనీదే!— అని' అన్నాడు.

బష్కీర్లు మళ్లీ తమలో తమరు మాట్లాడుకుంటూ, ఈసారి వాదించుగోడం మొదలెట్టారు. ఆ వాదన విషయం ఏమిటని ప్రహోమా అనువాదకుణ్ని అడగగా.—కొందరు ఈ భూమి గురించిన సంగతి తమ నాయకుడికి తెలియపరచవలిసిన విధాయకం తప్పించి అతడి పరోక్షంలో వ్యవహరించకూడదు అంటున్నారనిన్నీ, మరికొందరు అతడు వచ్చేదాకా ఆగవలిసిన అగత్యం లేదంటున్నారనిన్నీ, అతడు చెప్పాడు.

vi

బష్కీర్లు తమలో తమరు అట్లా వాదించుగుంటూ ఉండగా, ఒక నక్కఉన్నె టోపీ పెద్దది పెట్టుగుని ఒక మనిషి రంగం మీదికి చక్కావచ్చాడు. వాళ్ళంతా మౌనందాల్చి, లేచేశారు. ఆ దుబాసీ, 'వీరు మా నాయకులే,' అన్నాడు. తక్షణం ప్రహోమా ఉత్తమమైన పై అంగీ ఒకటీ, అయిదుపౌన్ల టీ పొట్లమూతీసి, అవి ఆ నాయకుడికి ఇయ్యజూపాడు. నాయకుడు వాటిని స్వీకరించి, ఒక అర్హాగౌరవాసనం అలంకరించాడు. వెంటనే ఆ బష్కీర్లు అతడితో ఏదో చెప్పడం ఆరంభించారు. కొంతసేపు నాయకుడు వాళ్ళమాటలు ఆలకించి, ఊరుకోండని వాళ్ళకి తలతో సంజ్ఞచేసి, ప్రహోమాని సంబోధిస్తూ రష్యనులో; 'సరేసరే, అల్లానేకానీ, నువ్వు ఏఖండం కోరుకున్నా సరే నీయిష్టం. మాకు బోలెడు భూమి ఉంది' అన్నాడు.

ప్రహోమా, 'నాకిష్టంవచ్చినంత భూమీ నేను తీసుగోడం ఎట్లా? వీళ్ళచేత నేనేదేనా పత్రం రాయించుగుని కట్టుదిట్టం చేసుగోవాలి. లేకపోతే వీళ్ళుభూమి 'నీదేనీదే' అని పైకి అంటూ తరవాత మెల్లిగా లాగేసుకోవచ్చు' అనుకుని, పైకి గట్టిగా 'దయాపూర్వకమైన మీమాటలకి నేను కృతజ్ఞుణ్ణి. మీకు బోలె డంత భూమి ఉంది, కాని నేను కోరేది చాలా స్వల్పం. అయినా నాభాగం ఏదీ అనే సంగతి రూఢిగా ఉండాలని నాకు ఉండచ్చుగా మరీ! అందుకని అది కొలిచి నాకప్పగించడానికి వీలుండదూ? చావు బతుకులు దైవాధీనం, మీరైతే సజ్జనులే, నాకిస్తారు. కాని మీతరవాత వాళ్ళు అది మళ్ళీ లాగేసుకోవచ్చుగదా!' అన్నాడు

నాయకుడు, 'నువుచెప్పింది పూర్తిగా తధ్యం. నీకు మేం అది యధావిధిగా స్వాధీనపరుస్తాం,' అన్నాడు.

ప్రహోమా మళ్ళీ అందుకుని, 'ఇక్కడికి ఒక వర్తకుడు వచ్చాడట, నేను విన్నాను. అతనికి కూడా మీరు కొంచెం భూమి ఇచ్చారట, తద్వతుగా ఏవో పత్రాలు సంతకంచేసి యిచ్చారట. ఆరీతిగానే నా విషయంలో కూడా మీరు చెయ్యాలని నాకు ఉంది' అన్నాడు.

నాయకుడు అర్థంచేసుగున్నాడు.

అతడు, 'ఓ, దానికేం? అదంతా మూణ్ణిమిషాల్లో చేసెయ్య గలం, మా శేఖరి ఉన్నాడు, పట్నానికి వెడతాం మీతోసహా, పత్రానికి శాస్త్రీయంగా ముద్ర వెయిస్తాం,' అన్నాడు.

ప్రహోమా, 'మరి ధర ఎల్లాఉంటుంది?' అని కనుక్కున్నాడు.

నాయకుడు, 'మేం చెప్పేధర ఎప్పుడూ ఒకటే—పగటికి వెయ్యిరూకలు' అన్నాడు.

ప్రహోమాకి బోధపడలేదు.

అతడు, 'పగటికా? అదెక్కడిమానం? పగలంటే ఎన్ని ఎకరాలూ?' అన్నాడు. నాయకుడు, 'అది ఎల్లా లెఖ్ఖకట్టాలో మాకు తెలియదు. మేం పగళ్లచొప్పునే అమ్ముతాం. ఒక పగలులో ఎంత భూమి చుట్టూ నువ్వు నడిచివెళ్ళి తిరిగి రాగలవో అదంతా నీదే. పగలు ఒకటికి ధర వెయ్యిరూకలు,' అన్నాడు. ప్రహోమా ఆశ్చర్యపడ్డాడు.

అతడు, 'కాని, ఒక పగలులో ఎంతో పెద్దమేర చుట్టుతిరిగి రావచ్చునే!' అన్నాడు.

నాయకుడు నవ్వాడు.

అతడు, 'అదంతా నీదే అవుతుంది. కాని ఒకషరతుఉంది. నువ్వు ఆ పగలు ముగియకుండా ఎక్కడ బయల్దేరావో అక్కడికి తిరిగి రాలేకపోయావా, నీసొమ్ము పోయిందన్న మాటే,' అన్నాడు.

ప్రహోమా, 'నేవెళ్ళినదారి నాకు మళ్లీ గుర్తుతెలియడం ఎల్లా?' అని అడిగాడు. నాయకుడు, 'ఏం? నువ్వు రమ్మన్న చోటికి మేం వస్తాం, వచ్చి అక్కడఉంటాం. అక్కడ నువ్వు బయల్దేరి, ప్రదక్షిణం ప్రారంభించు. ఒక పార చేత్తో పట్టుగుని, ఎక్కడ అవసరమని నీకుతోస్తే అక్కడల్లా ఒకగుర్తుపెట్టు. ప్రతీ మళుపు దగ్గిరా చిన్నగొయ్యిచేసి పచ్చికబెల్లులు పేర్చు. ఆతర్వాత మేం నాగలితో బయల్దేరి గోతికీగోతికీ ఒక చాలు దున్నేస్తాం.

నువ్వు నీ ప్రదక్షిణం నీయిష్టంవచ్చినంత విశాలంగా, చేసుగో వచ్చు. గాని సూర్యుడు అస్తమించే లోపల నువ్వు బయల్దేరిన చోటికి వచ్చితీరాలి. అల్లా రాగలిగితే నువ్వు చుట్టివచ్చిన భూమి అంతా నీది,' అన్నాడు.

ప్రహోమా ఆనందపడ్డాడు. ఆ బయల్దేరడం మర్నాడు పొద్దున్న అని స్థిరపరుచుగున్నారు. వాళ్ళు కొంత సేపు మాట్లాడి, మళ్లీ కొంచెం మద్యం తాగి, తరవాత మళ్ళీ కొంచెం మాంసం తిని, మళ్ళీ టీ తాగేసరికి, రాత్రిపడింది. ప్రహోమా పరుండ డానికి మృదువైన ఈకశయ్య ఇచ్చారు. బష్కీర్లు రాత్రికి ఎవళ్ళయిళ్ళకి వాళ్ళెళ్ళిపోతూ, మర్నాడు తెల్లవారకప్లే సమా వేశమై సూర్యోదయానికి పూర్వమే నియమితస్థలానికి స్వారి వెళ్ళాలని నిశ్చయపరుచుగున్నారు.

## vii

ప్రహోమా పడుకున్నది మృదుశయ్యేకాని, అతడు నిద్రించ లేకపోయాడు. తను కొనబోయే భూమి ఆలోచనే అతనికి. అతడు, 'ఎంత పెద్దమేరకి రేపు హద్దులు పెట్టేస్తానో! అస్త మయంలోపల ముప్ఫైఅయిదుమైళ్ళు ఆడుతూ పాడుతూ నడవ గల్ను. ఇప్పుడు పగళ్ళు దీర్ఘంగుడానూ! ముప్ఫైఅయిదుమైళ్ళ కైవారంలోపల ఎంతవిస్తీర్ణంగల భూమి ఉంటుందో! జబ్బుగా ఉన్నభూమి భాగాలు అమ్మేస్తాను, లేకపోతే రైతులకి అమర్చే స్తాను, ప్రశస్తమైనభూమి అందులో ఎక్కడో ఏరిపట్టుగుని సేద్యంచేస్తాను. ఎడ్లజట్లు రెండుకొంటాను, చాలా ఎక్కువమంది కూలీలని కుదురుస్తాను. ఒక నూటయాభై ఎకరాలు సేద్యపు

భూమిగా చేస్తాను, తక్కిన భూమిమీద పశువుల్ని మేపిస్తాను' అనుకున్నాడు.

ప్రహోమా రాత్రంతా మేలుకునే ఉన్నాడు కాని, ఇక తెల్లార బోతుందనగా నిద్దరోయాడు. అతనికి కళ్ళు ఇల్లా మూతపడడం ఏమిటి, కల రావడం ఏమిటి. ఆకలలో తను ఆదేరాలోనే పడు కుని ఉండగా బయట ఎవరో నవ్వు అపుగుంటూన్నట్టు తనికి వినపడింది. వా రెవరై ఉంటారా అని తనకి ఆశ్చర్యంవేసి, తను లేచి, బయటికి వెళ్ళిచూడగా ఆ బష్కీరునాయకుడే దేరాముందు కూచుని, రెండుపక్కలూ చేతుల్తో పట్టుగుని, నవ్వుతో దొర్లి పోతున్నాడు. ఆ నాయకుణ్ణి సమీపించి, తను, ఎందుకూ అంత ఇదిగా నవ్వుతున్నావు అని అడిగాడు. తీరాచూస్తే ఆ మనిషి బష్కీరునాయకుడు కానేకాడూ, ఈ మధ్య తన యింటిదగ్గిర ఆగి ఈ భూమి వయినం చెప్పిన వర్తకుడు! తనువాణ్ణి 'చాలా కాలం అయిందా నువ్వొచ్చి?' అని అడగబోతూ వాడిమొహం కేసి చూసేసరికి వాడు ఆ వర్తకుడూ కాడు, వోల్గా అవతల్నించి చిరకాలంకిందట తన మరీ పాతయింటికి వచ్చిన రైతు! పరకాయించి వాణ్ణి తను మళ్ళీ చూడగా వాడు ఆ రైతూ కాడు, డెక్కల్తోనూ కొమ్ముల్తోనూ ఉన్న మహాశని! వచ్చే నవ్వు నొక్కేసుగుంటూ అక్కడ కూచున్నాడు. వాడి యెదట నేలమీద చొక్కా లాగూమాత్రం ధరించి ఉత్తపాదాలతో చాపచుట్టలాగ పడిఉన్నాడు. అక్కడ పడిఉన్నవాడు ఏరకంమనిషో గ్రహించ డానికి, తను ఎక్కువ శ్రద్ధపట్టి పరీక్షగా (ఆ కలలోనే) చూడగా వాడు చచ్చిఉన్నాడు, పైగా వాడు తనే! అతను హడలెత్తి

పోయాడు. లేచి, 'అబ్బ, మరీ ఎల్లాంటివి వస్తూంటాయో, కల్లోకి!' అనుకున్నాడు. చుట్టూ చూడగా ఒక తలుపు తీసుంది, అందులోంచి బయటి తెలుపు కనపడుతోంది.

అతడు, 'వాళ్ళని లేవగొట్టడానికి వేళ అయింది. ఈపాటికి విధాయకంగా బయల్దేరాలి' అనుకున్నాడు. లేచివెళ్ళి. తమ బండిలో పండుకున్న తన నౌఖర్ని మేలుకోగొట్టి, బండి పూన్చరా అని వాడితోచెప్పి, బష్కీర్లని లేపడానికి అతడు వెళ్ళాడు. వెళ్ళి 'పచ్చికబయలుమీద భూమికి హద్దులు పెట్టే టందుకు వెళ్ళవలిసినవేళ అయింది' అని చెప్పాడు.

బష్కీర్లులేచి, సమావేశపడ్డారు. నాయకుడూ వచ్చాడు. వాళ్ళు మద్యం మళ్ళీతాగి, ప్రహోమాకి టీ ఇయ్యబోయారు. కాని, అతడు వద్దనేసి, 'మనం వెళ్ళవలసి ఉంటే, వెడదాం పదండి. ఇక్కడికే వేళ మీరింది,' అన్నాడు.

viii

బష్కీర్లు సిద్ధపడి అంతా బయల్దేరారు. కొందరు గుర్రా లెక్కారు కొందరు బళ్ళల్లో ఎక్కారు. ప్రహోమా తన బండిలో తన పని మనిషినీ ఓ పారా వేసుగుని —వెళ్ళాడు. పచ్చిక బయలు చేరేటప్పటికి ప్రభాతం యొక్క అరుణిమ రగలడం మొదలెట్టింది. వాళ్ళు ఒక చిన్న శిఖరానికి ఎక్కి బళ్ళూ గుర్రాలూ దిగి, ఒక స్థలంలో కూడుకున్నారు. నాయకుడు ప్రహోమా ఎదటికివచ్చి, తన బాహువు ఆ మైదానంకేసి చాచి, 'చూడూ. ఇదంతా, కనుచూపు మేరవరకూ. మాదే, ఇందులో నీకు ఏ భాగం కావలిస్తే అది పుచ్చుగో,' అన్నాడు.

ప్రహోమా కళ్లు మెరిసిపోయాయి. అదంతా తొలిసాగు నేలే, ః సమతలం, అరిచెయ్యిలాగ: నల్లటినలుపు, గసగసాల గ: మరి పల్లాల్లో రకరకాల గడ్డి, ఛాతీ ఎత్తున ఉంది!

నాయకుడు తన నక్కఉన్నిటోపీ తీసి, నేలమీద పెట్టి, ।దుగో, ఇదీ గుర్తు. ఇక్కణ్ణించి బయల్దేరి మళ్ళీ ఇక్కడికే చ్చెయ్. నువ్వు ఎంత మేర చుట్టివస్తే ఆ మేరంతా నీదే!' న్నాడు.

ప్రహోమా తన సొమ్ముతీసి ఆ టోపీమీద ఉంచాడు. తర ాత తనపైకోటు తీసేసి, చేతులులేని పొట్టికోటు మాత్రం అట్టే ఏట్టి, తన తోలుకాసె వదులుచేసి పొట్టకి కిందుగా అది గట్టిగా )గించుగుని, పొట్టికోటులో ఎదరవైపు చిన్న రొట్టెసంచీ ఇమి ర్చేసి, నీటిబుడ్డి ఒకటి కాసెకి అంటగట్టి, బూట్లు మోకాలి )ప్పలదాకా లాగేసి తొడుక్కుని, పనిమనిషి దగ్గిర్నించి పార పుచ్చుగుని, బయల్దేరడానికి సిద్ధం అయాడు. ఏవైపు వెళ్ళడం వయమా అని కొన్ని క్షణాలు అతడు ఆలోచించాడు—ప్రతీ వైపూ అతణ్ణి వలేసి లాగేస్తూన్నట్టుంది. అతడు, 'ఎటైతే ఏముందీ? ఉదయ సూర్యుడికేసే ప్రారంభిస్తాను వెళ్ళడం' అను కున్నాడు. అతడు తూర్పుగా తిరిగి, నిటాగ్గా నుంచుని, దిక్చక్రంపైన సూర్యబింబం ఎప్పుడు కనిపిస్తుందాఅని నిరీక్షిస్తూ, 'కాలం పాడుచేసుగో కూడదు. చల్లపాటుగా ఉన్నప్పుడు మరీ తేలికగా నడవచ్చు,' అనుకున్నాడు.

సూర్యబింబం అంచు దిక్చక్రంపైన తళుక్కుమనీ అనడం తడువుగా ప్రహోమా, ఒక పార తన భుజాన్ని వేసుగుని, దిగ పచిక బయలులో పాదంపెట్టాడు. మొదట అతడు వేగంగానూ

నడవలేదు, మందంగానూ నడవలేదు. ఓ వెయ్యి గజాలు వెళ్ళి, అతడు ఆగి, ఒక చిన్న గొయ్యిచేసి దానిమీద పచ్చిక బెల్లులు పేర్చి అది యింకా కనపడేటట్టు చేశాడు. తరవాత మళ్ళీ నడవడం సాగించాడు. ప్రథమావస్థలో ఉండేనడక బెట్టువదిలి పోయేటంత దూరం అతడ నడిచెయ్యడం అయిపోయింది గనక, అతడు అడుగు ధూకుడుగా వేశాడు. కొంత సేపైం తరవాత మరో గొయ్యి చేశాడు. ప్రహోమా వెనక్కి తిరిగి చూశాడు. ఎండలో ఆ గుట్ట స్పష్టంగా కనపడింది, ఆ మనుష్యులూ గోచరించారు, బండిచక్రాలచుట్లు తళ తళ లాడాయి. స్థూలంగా అంచనా వేసి తను ఒక మూడు మైళ్లు నడిచున్నట్టు అతడు ఊహించాడు. కొంచెం వేడి ఎక్కువైంది. పొట్టికోటు తీసేసి అతడు తన భుజంమీద అడ్డంగా పారేసుగుని నడుచుగుంటూ పోయాడు. వేడి తీవ్రం అయింది. అతడు సూర్యుడికేసి చూసి, చల్దికి వెళ్లైందనుకుని, 'ఇక్కడికి ప్రథమపాదం అవుతోంది, కాని పగలంతకీ పాదాలు మొత్తం నాలుగు. నే నప్పుడే దిశ మళ్ళకూడదు, అల్లా చెయ్యడం సకాలానికి ముందే మళ్ళి నట్టవుతుంది. కాని, నా బూట్సు మాత్రం తీసెయ్యాలి,' అనుకుని. కూచుని, బూట్సు తీసేసి తన కాసెకి గుచ్చేసి, నడక సాగించాడు. ఇప్పుడు నడక తేలికే అనిపించింది, అతడు, 'మరో మూడుమైళ్ళెళ్ళి ఎడమకి మళ్లుతాను. ఈ చోటు మరీ సొగసుగా ఉంది, దీన్ని వదులుకోడం అనేది జాలిపడవలిసిన విషయం. వెడుతూన్నకొద్దీ ఈ భూమి మరీ బాగుండేడట్టుంది' అనుకున్నాడు.

కొంచెంసేపు అతడు ఆదిశలోనే వెళ్ళి వెనక్కి తిరిగిచూడగా గుట్ట కనపడీ కనపడకుండా ఉంది, అక్కడి మనుషులు నల్ల

చీమలులా ఉన్నారు, అక్కడ ఎండలో ఏదో తళుక్కుమం టోంది, ప్రహోమా, 'అయ్యో! ఈ దిశలో నేను మరీదూరం నడిచాను. మళ్ళడానికి వేళ అయింది. పైగా, నాకు ముచ్చెమ టలూ పోశాయి, నాలికపిడచకడుతోంది' అనుకుని ఆగి, ఒక పెద్దగొయ్యి చేసి పచ్చిక బెల్లులు పేర్చాడు. తరవాత నీటిబుడ్డి తీసి. దాహం తాగి తక్షణమే ఎడమకి మళ్ళాడు. అతడు నడి చాడు, ఓ, తెగనడిచాడు. పచ్చిక ఎత్తుగాఉంది, ఎండ చాలా తీక్షణంగా ఉంది. ప్రహోమా అలిసిపోడం మొదలెట్టాడు. సూర్యుడి కేసి చూస్తే మిట్టమధ్యాహ్నం అయింది. 'సరే. నేను విశ్ర మించి తీరాలి,' అనుకున్నాడు,

అతడు కూచుని కొంచెం రొట్టెతిని, కాసిని నీళ్ళుతాగాడు—కాని పడుకోలేదు. పడుకుంటే నిద్ర వచ్చిపడుతుందని అతని భయం. కాస్సేపు కూచుని మళ్లీ నడకసాగించాడు. మొదట తేలికగానే నడిచాడు, తిండి తిన్న తరవాత పుష్టి చేరుకుని కాని ఎండ పేల్చేసెయ్యడంవల్ల అతనికి నిద్దరకళ్ళు పడ్డాయి. అయినా సరే అతడు ఇంకా వెడుతూ 'మరోగంటబాధ, ఒక జీవితకాలం సుఖజీవనం,' అనుకున్నాడు.

ఈ దిశలోకుడా అతడు చాలాదూరం పోయి పోయి ఎడమకి మళ్ళాలని సిద్ధంగా ఉండగా, అతడికి తడిగా ఉన్న పల్లం ఒకటి గోచరించింది. 'దీన్ని మినహాయించుగోడం జాలిపడవలిసిన విషయం, ఇక్కడ జనపనార మహాబాగా అవుతుంది,' అను కున్నాడు. అందుకని. ఆ పల్లం తనకి వచ్చేలాగ దాని పక్క నించే నడుచుగుపోయి దానికి అవతలపక్క గొయ్యిచేసి తర

వాతే ఎడమకి మళ్ళాడు. అతడు గుట్టకేసి చూశాడు. ఎండవేడికి గాలి మసగగా అయింది. చూస్తే అంతావణుకుతూన్నట్టు ఉంది! ఆ మసగకి గుట్టమీదివాళ్ళు కనపడడమే లేదు. అతడు. 'అయ్యో! నేను నడిచిన రెండు దిశలా దీర్ఘంగానే నడిచాను. ఈ దిశలో తక్కువమేరే నడుస్తాను.' అనుకుని. ఈమూడోదిశ నడక ధూకుడు చేశాడు. సూర్యుడికేసి చూశాడు. పడమటకి అతడు సగం వాలిపోయాడు. అయినా ఇప్పటి కింకా ఆ మూడోదిశ నడక రెండుమైళ్ళైనా కాలేదు. అతడు గమ్యస్థానానికి ఇంకా పదిమైళ్ళలో ఉన్నాడు. అతడు, 'అబ్బెబ్బే, నా భూమి కోసుగా తయారైతే అయిందిగాని, నేను మరివేగిరపడి, సూటిగా ఆళం గుకి వెళ్ళిపోవాలి, లేకపోతే మరీదూరం అవుతాను. ఇక్కడికే నాకు లెఖ్ఖలేనంత భూమి ఉంది' అనుకున్నాడు.

ప్రహోమా తొందరతొందరగా ఒక గొయ్యిచేసి. గుట్టకేసి తిరిగి, అది చూసుగుంటూ నడిచాడు.

xi

ప్రహోమా గుట్టకేసే నడిచాడు గాని, కష్టంమీదగాని అడుగు వెయ్యలేకుండా అయాడు. ఎండవేడికి అతనిపనయిపోయింది. ఉత్తపాదాలు గనక అవి కోసుగుపోయి పుళ్ళు పడ్డాయి, అతని కాళ్ళు తేలిపోయాయి. అతనికి విశ్రమించాలని ఉంది. కాని, గుట్ట దగ్గిరికి అస్తమయం వేళకేనా వెళ్లాలంటే విశ్రమించడం అసంభవం. సూర్యుడు ఎవడికోసమూ ఆగడు, కిందికిందికి పడిపోతున్నాడు.

అతడు, 'ఓహో! ప్రియా! మరీ ఎక్కువకోసం యత్నించడం అనే ఘోరప్రమాదం కాస్తా నేను చెయ్యకపోయుంటే! ఒకవేళ నేనక్కడికి ఆలస్యంగా చేరితే ఏమ్ముట్లో!' అనుకున్నాడు, అతడు

గుట్టకేసీ సూర్యుడికేసీ చూశాడు. గమ్యస్థానానికి ఇంకా చాలా దూరంలో తనున్నాడు, సూర్యుడు దిక్చక్రసమీపానికి వచ్చేస్తున్నాడు. ప్రహోమ్ నడిచి నడిచి ఏకగ్రనడిచాడు. నడవడం అతనికి మహాకష్టంగా ఉన్నా ఇంకావడిగా మరీవడిగా నడిచాడు. తనని తనే తోసుగుంటూ కుడా నడిచాడు, కాని, తను ఆచోటికి ఇంకా చాలా దూరాన్నే ఉన్నాడు. అతడు పరిగెత్తడం మొదలెట్టాడు, కోటూ బూట్సూ, బుడ్డీ, టోపీ—ఒక్కొక్క చేతీసేసి విసిరి అవతలపారేసి, ఆధారంగా ఉంటూండడంచేత పారమాత్రం ఉంచుగున్నాడు. అతడు మళ్ళీ, 'ఏమిటి నాకర్తవ్యం? మరీ ఎక్కువ పట్టుగోపోయాను, వ్యాపారం యావత్తూ నాశనం చేసుగున్నాను, సూర్యాస్తమయంలోపల అక్కడికి నేను చేరుకోలేను,' అనుకున్నాడు.

ఈ భయంతో అతనికి ఊపిరే అందలేదు. అతడు పరిగెత్తుతూ వెళ్ళాడు, చొక్కా లాగూ నానిపోయి అతని ఒంటికి అంటుగుపోయాయి. నోరు ఎండిపోతోంది. అతని రొమ్ము కమ్మరితిత్తిలాగ పనిచేస్తోంది, అతని గుండె సుత్తిదెబ్బలు కొడుతోంది, అతని కాళ్ళు వేళ్ళాడిపోయి అతనివి కానట్టు అయిపోయాయి. ఈ హైరానకి ప్రాణం పోతుందేమో అనే భయం అతణ్ణి అవహించింది. మరణం అంటే భయంవేసినా, అతడు ఆగక, 'ఇంతదూరం పరిగెత్తుకువచ్చి ఇప్పుడు ఆగిపోతే, వీడు పరమ మూర్ఖుడు అంటారు నన్ను' అనుకున్నాడు. ఇంకా పరిగెత్తి ఇంకా పరిగెత్తి, అతడు వెళ్ళాడు. ఆ బష్కీర్ల అరుపులూ కేకలూ తనకి వినపడేటంత సామీప్యంలోకి అతడు వెళ్ళాడు.

వాళ్ళగోల అతని హృదయాగ్నికి వాయువైంది. అప్పటికి మిగిలి ఉన్న బలాన్ని పోగుచేసేసుగుని, అతడు ఇంకా పరిగెత్తాడు.

సూర్యుడు అంచుమీదికి వచ్చేశాడు, మంచుమూలాన్ని పెద్ద పరిమాణంలోనూ రక్తంలాగ ఎర్రగానూ కనపడ్డాడు. అదుగో, ఇప్పుడే, మరే ఇప్పుడే, ఇక అస్తమిస్తాడు. సూర్యుడు చాలా కిందికి వచ్చేశాడు, కాని అతడుకుడా లక్ష్యానికి చాలా దగ్గిరిగా వచ్చేశాడు. తనని వేగిరపరచడానికి గుట్టమీదిజనం చేతులు ఊపడం అప్పుడే ప్రహోమా చూడగలిగాడు. నేల మీదున్న నక్కఉన్నెటోపీ, దానిమీది సొమ్మూ, అక్కడే నేల మీద తన పక్కలు రెండూ చేతుల్తో పట్టుగుని కూచున్న నాయకుణ్ణీ అతడు చూడగలిగాడు. అప్పుడు ప్రహోమా, తన కల తనకి జ్ఞాపకం రాగా, 'భూమి బోలెడంతఉంది. కాని, దేవుడు నన్నందులో జీవించనిస్తాడా అని? నా ప్రాణం ఇప్పుడే పోగొట్టుగున్నాను! నా ప్రాణం ఇప్పుడే పోగొట్టుగున్నాను! ఆ లక్ష్యం నేనెన్నటికీ చేరుకోలేను!' అనుకున్నాడు.

ప్రహోమా సూర్యుడికేసి చూశాడు, సగం బింబం భూమిలోకి దిగి ఇదివంకే మాయమైంది. అతడు తనకి ఇంకా మిగిలిన బలం అంతటితోనూ మరీముందుకి వాలిపోయి ఎగబడ్డాడు. అతని శరీరవేగానికి తుల్యం కాలేకపోయింది అతని కాళ్ళవేగం! అతడు నేలబడకుండా వెళ్ళడం బ్రహ్మాండమైపోయింది. అతడు గుట్ట చేరగానే అకస్మాత్తుగా చీకటిపడింది. అతడు పైకిచూశాడు. సూర్యుడు అస్తమించేశాడు. అతడు గట్టిగా అరుస్తూ, 'నా శ్రమ యావత్తూ నేలబడిపోయింది,' అనుకుని, ఆగిపోదాం అను

కున్నాడు. కాని, బష్కీర్ల హుషార్ కేకలు అతనికి ఇంకా విని పిస్తూనేఉన్నాయి. అప్పుడు కింద ఉన్న తనకి సూర్యుడు అస్త మించినట్టు కనపడినా, గుట్టమీది వాళ్లు సూర్యుణ్ణి ఇంకా చూడ గలుగుతూంటారని అతనికి స్ఫురించింది. ఒక దీర్ఘనిశ్వాసం చేసి, అతడు గుట్టమీదికి పరిగెత్తాడు. అక్కడ ఇంకా వెలుగు గానేఉంది. శిఖరానికి వెళ్లి అతడు ఆ టోపీచూశాడు. దాని ఎదట నాయకుడు పక్కలు రెండూ చేత్తోపట్టుగుని నవ్వుతూ కూర్చున్నాడు. ప్రహోమాకి కల మళ్ళీ జ్ఞాపకం వచ్చింది. అతడు ఒక కేకపెట్టాడు. అతనికాళ్ళు కుంగిపోయాయి. అతడు ముందుకి పడిపోయి, చేతుల్తో ఆ టోపీ అందుకున్నాడు.

నాయకుడు, 'బలే! చాలాగట్టివాడు! చాలా భూమి సంపా దించేశాడు,' అని అతణ్ణి మెచ్చాడు.

ప్రహోమా నౌఖరు పరిగెట్టుకుంటూ పైకి ఎక్కి అతణ్ణి పైకి లేవదీయబోయాడు. కాని అతడు నెత్తురు కక్కుగుంటు న్నాడు! ప్రహోమా మరణించాడు.

బష్కీర్లు తమనాలికలు అంగుళ్ళకినొక్కి తప్పుమనిపించి, తమ జాలి వెల్లడించారు.

ప్రహోమా నౌఖరు ఆ పార పుచ్చుగుని, ప్రహోమాని పడుకోపెట్టడానికి సరిపడ గొయ్యితవ్వి, అతణ్ణి అందులో పూడ్చాడు. ఆరడుగులే, మాడపట్టునించి అరికాళ్ళదాకా, అతని అవసరం అంతా.

---

# దేనివల్ల మనుషులు బతగడం?

(సాటిమానవుల్ని ప్రేమించడం వల్లనే మృత్యువు గడిచి జీవితంలో పడ్డాం అని తెలుగున్నాం—సెంటు యోహాను-మొదటి లేఖ **iii**-14.

ప్రాపంచిక వస్తువులు కలిగుండి, వాటి అవసరం గల సాటిమానవుణ్ణీ చూస్తూ వాడికి కనికరంచూపించకుండా దాచేసుగునే మనిషిలో దేవుడిప్రేమ ఎల్లా ఉంటుందీ? నా చిన్నికూనలారా! మనం మాటతోనూ నాలికతోనూ మాత్రమే ప్రేమించవద్దు. కార్యరూపంగానూ. యథార్థంగానూ ప్రేమించుదాం **iii**—17, 18

ఏ మానవుడూ ఎన్నడూ దేవుణ్ణీ చూడలేదు. మనం అన్యోన్యప్రేమ కలిగుంటే, దేవుడు మనలో ఉంటాడు—**iv**-12

ప్రేమ దేవప్రసాదం, ప్రేమ ప్రసరించేవాడు. దేవునినంతతి, దేవుని తెలుసుగున్నవాడు. ప్రేమించలేనివాడు దేవుని తెలుసుగోలేడు. ఏమంటే, దేవుడు ప్రేమే—**iv** 7, 8.

దేవుడు ప్రేమే. ప్రేమలో ఉండేవాడు దేవుడిలో ఉంటాడు, దేవుడు వాడిలో ఉంటాడు-**iv**.16

ఎవడేనా తను దేవుణ్ణీ ప్రేమిస్తున్నానని అంటూ సాటిమానవుణ్ణీ ద్వేషిస్తే, వాడు అబద్ధాలకోరు. ఏమంటే! కంటపడే సాటిమానవుణ్ణే వాడు ప్రేమించక పోతే; కంటపడని దేవుణ్ణి వాడు ప్రేమించగలడా?—**iv**, 20.)

## i

సిమోను చెప్పులు కుట్టేవాడు. అతడి స్వంతానికి కొంపా లేదు, పొలమూలేదు. భార్యతోటీ పిల్లలతోటీ ఒక రైతు గుడిసెలో ఉంటూ అతడు తన రెక్కలకష్టంవల్ల పొట్టపోసుగుంటున్నాడు. పని చౌకా రొట్టె ప్రియమూ అవడంచేత, అతడికి వచ్చేది తిండికి సరిపోయేది. శీతకాలంలో తొడుక్కోడానికి అతనికీ భార్యకీ ఉమ్మడిగా ఒకఛేచర్మం కోటు ఉండేది. అదేనా

అన్నీ చిరుగులూ అన్నీ పీలికలూ. కొత్తకోటు కుట్టించడానికి కావలిసిన గొర్రె చర్మాలు కొనడానికి అతడికి డబ్బులోటు రావడం అది అప్పుడే రెండో యేడు. అందుకని శీతకాలం ముందు అతడు కొద్దిగా మిగిల్చాడు, పెళ్ళాం పెట్టెలో మూడు రూకలు దాచి పెట్టింది. అయిదురూకల చిల్లర అతనికి గ్రామ వతనదార్ల దగ్గిర్నించి రావాలి. ఒకనాడు పొద్దున్న గొర్రె చర్మాలు కొనే నిమిత్తం గ్రామం వెళ్ళడానికి అతడు ఆయత్త పడ్డాడు. అతడు తన షర్టు తొడుక్కుని, దానిమీద తనభార్య తాలూకు పూలుబొంత పచ్చనూలు జాకెట్టువేసి, ఆపైని తన నూలుకోటు ధరించాడు. మూడురూకలూ జేబులో వేసుగుని, చెక్కినకర్ర ఒకటి ఊతకర్రగా తీసుగుని, మంచిమాట చేసుగుని బయల్దేరాడు. 'నాకు రావలిసిన బాకీ అయిదురూకల పైచిలుకూ వసూలుచేస్తాను, మనిదగ్గిర మూడురూకలున్నాయి, శీతకాలపుకోటుకి చర్మాలు కొనడానికి ఈ సొమ్ము చాలు' అనుకున్నాడు. గ్రామంచేరి ఒక రైతుఇంటికి వెళ్ళాడు. వాడు ఇంట్లో లేడు. వాడిభార్య తనదగ్గిర ఏమీలేదనీ వచ్చేవారం బాకీ ఇచ్చేస్తామనీ చెప్పింది, సిమోను మరో రైతింటికివెళ్ళాడు, ఆరైతు తన దగ్గిర అప్పట్లో ఏమిలేదని ఒట్టెట్టుగున్నాడు, కాని సిమోను తన బూట్సుజత బాగుచేసినందుకు ఇరవై చిన్నడబ్బు లిస్తానన్నాడు. (వాళ్ళరూకకి వంద చిన్నడబ్బులు). తరవాత సిమోను ఎల్లానైనా గొర్రెచర్మాలు అరువుకి కొనాలని చూశాడుగాని, వర్తకుడు అతణ్ణి నమ్మనన్నాడు. సొమ్ము పట్టుగు రావయ్యా, ఒకటోరకం చర్మాలు ఏరి పట్టుగు పోదువుగానీ! బాకీ వసూ

లంటే ఎట్లా ఉంటుందో మనం ఎరుగుదుంగా' అనేశాడు. అందు
కని, ఆ గొడారి చక్కబెట్ట గలిగినపని అంతా ఏమిటి అంటే:
బాగుచేసిన బూట్సుకి ఇరవై డబ్బులు వసూలు చేసుగోవడమూ,
మరొక రైతు అల్లికబూట్సుజోడుకి అడుగుతీసి అడుగు
వెయ్యడానికి అప్పుగోవడమున్నూ. సిమోను నిరుత్సాహ
పడ్డాడు. ఆ ఇరవై చిన్నడబ్బులూ పెట్టి తాగేశాడు. ఏ చర్మాలూ
కొనకుండానే ఇంటిమొహం పట్టాడు పొద్దున్న వచ్చేటప్పుడు
చలి మంచుతో బాధపడ్డాడు గాని ఇప్పుడు మద్యం పుచ్చుగున్న
తరవాత, అతనికి చర్మంకోటు లేకుండానే, వెచ్చగా ఉన్నట్టు
అనిపించింది. అతడు తూలుతూ, గడ్డకట్టిన చలిమంచుని ఒక
చేత్తో కర్రతో కొట్టుగుంటూ, బాగుచెయ్యడానికి తెచ్చిన అల్లిక
బూట్సుని రెండో చేత్తో ఊగించుగుంటూ, తనలో తను మాట్లాడు
కుంటూ నడిచాడు: 'నాకు చాలా వెచ్చగా ఉంది, చర్మం కోటు
నాకు లేకపోతేం? ఒకచుక్క వేసుగున్నాను, అది నాళాలంతటా
వ్యాపించింది. నాకు గొర్రె చర్మాలు అక్కర్నేలేదు. ఏదో
గడిపేస్తాను. దేన్ని గురించీ చింత పెట్టుగోను. అదీ నా రకం,
నాకు లెఖ్ఖేమిటి? గొర్రెచర్మాలు లేకపోయినా బతగ్గలను. వాటి
అవసరం నాకు లేదంటేనే! కాని, నా భార్య, తప్పకుండా,
విసుక్కుంటుంది. నిజమే మరీ, సిగ్గుచేటు: రోజు పొడూగునా
పనిచెయ్యడమూ, కూలి చేతులోపడక పోడమూనా! ఒఖ్ఖమాటు
ఉండు. ఆ డబ్బు నువ్వు పట్టుగు రాకపోతే, నీ చర్మం ఒలిచే
స్తాను చూసుగో. ఒల్చెయ్యకపోతే ఒట్టూ! అదెట్లా? వాడు
ఇరవై చిన్నడబ్బులే ఇస్తాడు ఒక్కొక్కసారి! ఇరవై చిన్న

డబ్బుల్తోటీ నేనెం జేసుగోనూ? తాగేస్తేసరి. ఎవడేనా చెయ్యి గలిగింది అంతే! వాడు డబ్బు ఇబ్బందిలో ఉన్నాడట, చెప్పాడు. వాడు అల్లా ఉండచ్చు. కాని, నా మాట? నీకు ఇల్లుంది, పశువులున్నాయి, ప్రతీదీ ఉంది, నాకు ఒంటిమీది దుస్తులు తప్ప మరేమీలేదు. నీకు ధాన్యం పండుతోంది, నేను ప్రతీగింజా కొనుక్కోవాలి, ఎంత జాగర్తైనా పడతాను, అయితేం, వారానికి మూడు రూకలూ అక్కడ పెడితేగాని రొట్టికే చాలదు. అసలు ఇంటికి వెళ్ళేసరికి రొట్టి అయిపోతుంది. మరో రూకన్నర చెల్లించుగోవాలి. అందుకని నీ బాకీ పూర్తిగా చెల్లించెయ్! దాన్ని గురించిన బుద్ధితక్కువ మరి వద్దు'—అని,

అప్పటికి అతడు రోడ్డు మళుపుదగ్గిరున్న ఒక గుడి సమీపించాడు. తల యెత్తేసరికి గుడివెనకాల ఏదో తెల్లవాకుగా అతనికి కనపడింది. వెలుగు సన్నగించి పోతూండడంవల్ల ఎంత కళ్ళుచించుగున్నా అదేమిటో అతడు తెలుగోలేకపోయాడు. 'లోగడ ఇక్కడ తెల్లరాయి ఏదీ లేదే! ఎద్దు అయుంటుందా? అబ్బే ఎద్దులాలేదు. మనిషే. తల అదేమిటీ. కాని, మరీతెల్లగా ఉందే? అయినా మనిషికి పనేముంటుం దక్కడా?' అనుకున్నాడు. ఇంకా దగ్గిరికి వెళ్ళాడు. అది మరీ స్పష్టం అయింది. ఆశ్చర్యపడిపోయాడు. నిజంగా మనిషే. బతిగున్నాడో చచ్చిపోయాడోగాని దిగంబరుడై గుడిగోడకి జేర్లపడి చలనం లేకుండా కూచున్నాడు. ఆ గొడారికి హడలు పట్టుగుంది. అతడు, 'ఎవడో వీణ్ణి చంపేసి, బట్టలు లాగేసుకుని, ఇక్కడ వదిలేశుంటాడు. ఏమన్నా కలగజేసుగుంటినా, నాకు చిక్కులు తప్పవు' అనుకుని, సాగిపోయాడు. గుడిదాటే క్షణంలో అతడికి

వాడు కనపడేమీలు పోయింది. కొంత దూరం వెళ్ళి అతడు వెనక్కి చూశాడు. ఆ మనిషి గుడికి జేర్లపడ్డ స్థితిలో కాకుండా తనకేసి చూస్తూన్నట్లు కదలడం ప్రారంభించాడు. గొడారికి మరీ భయమేసిపోయి, తనలో, 'వెనక్కి వీడిదగ్గిరికి వెళ్ళనా, ముందుకి సాగిపోనా? ఈ నీచు డెవడో ఎవరికి తెలుస్తుందీ? ఏమీ మంచి చెయ్యడానికి రాలే దిక్కడికి వీడు. నేనువాడిదగ్గిరికి వెళ్ళడంతోటే వాడు నామీదికి ఒక్క ఎగురు ఎగిరి నా గొంతిగ పిసిగేస్తే, నేను మరి యింటికి వెళ్ళడం ఎల్లా? పోనీ అల్లా చెయ్యదనుకున్నా, ఇంటికి తీసిగెడితే తిండెట్టి భరించద్దూ? ఈ దిగంబరుడు నాకు ఏం ఉపయోగం? నాబట్టలు ఇద్దాం అంటే నాకున్నవల్లా ఇవే. దైవకృపవల్ల ఇక్కణ్ణించి నేను పోతేచాలు!' అనుకుని, గబగబా తొక్కుగుపోయి గుడికి కొంతదూరం వెళ్ళే టప్పటికి, అతడి అంతరాత్మ అతణ్ణి తట్టినట్లై అతడు ఆగిపోయి, తనలో, 'ఒరేయ్, సిమోన్, ఏమిట్రా నువ్వు చేస్తూన్నపనీ? అవతల ఒక సాటిమానవుడు తిండీబట్టాలేక చస్తున్నాడూ? భయ పడిపోయి నువ్వు పక్కనించి పప్పులాగ జారిపోతున్నావూ! దొంగలకి భయపడేటంత డబ్బు నీ కెక్కడ పోగైందిరా? ఛీ! సిగ్గుచేటురా, సిమోన్, సిగ్గుచేటు' అనుకున్నాడు. అతడు గిరుక్కున వెనక్కి తిరిగి, ఆమనిషివైపు వెళ్ళాడు.

ii

సిమోను ఆ పరాయివాణ్ణి కొంత సమీపించి, జాగర్తగా చూశాడు. వాడు యువకుడు, ఆరోగ్యంగానే ఉన్నాడు, ఒంటిమీద దెబ్బలేమీలేవు. భయంవల్లా చలివల్లా ఆ మనిషి కొయ్య

జారుతూన్నట్టు స్పష్టం అవుతోంది. సిమోనుని చూడడానికి దృష్టి ఎత్తలేనంత బలహీనంగా ఉన్నట్టు వెనక్కి జార్లపడి అతడు కూచున్నాడు. సిమోను బాగా దగ్గిరికి వెళ్ళగానే ఆ మనిషికి మెలకువ వచ్చినట్టయింది. తలయెత్తి. కళ్ళు విప్పి, అతడు సిమోను మొహంలోకి చూశాడు. ఆ ఒక్కచూపూ చాలు, సిమోనుకి అతనంటే ఆప్యాయం బయల్దేరడానికి—అన్నట్టు అయింది. అతడు తన చేతులోని అల్లికబూట్సు కిందపారేసి, కాశెకోక విప్పి దాని మీద పెట్టేసి, తన నూలుకోటు విడిచాడు. 'మాటలు తరవాత కానియ్యొచ్చుగాని, తక్షణం ఇది తొడుక్కో' అన్నాడు. అని, సిమోను ఆ మనిషిని మోచేతులు పట్టుగుని లేవడానికి సాయంచేశాడు. అతడి ఒళ్లు శుభ్రంగానే ఉంది మంచి స్థితిలోనే ఉంది, అతని చేతులూ పాదాలూ తీరుగా ఉన్నాయి, అతని మొహంలో మంచితనమూ దయా స్ఫురిస్తున్నాయి. సిమోను తనకోటు అతని భుజాలమీద వేశాడుగాని ఆ కోటుచేతులు ఎవో అతనికి తెలియలేదు. సిమోను అతడి చేతులు కోటుచేతుల్లోకి జొనిపించి, కోటు అంతటా సర్దుకునే టట్టు తొడిగి, ఒంటికి పట్టేలాగ దాన్నిలాగి, నడుంకి తన కాశె బిగించి కట్టేశాడు. సిమోను తన చిరుగుటోపీకుడా తీసి అతని నెత్తిని పెడదాం అనుకుని తీశాడు, కాని తన తల చలికి బండబారడం చూసి, తనలో, 'నాది బొత్తిగా బట్టతలకదానూ, ఇతనికి దట్టంగా ఉంగారాల జుట్టుంది' అని ఆలోచించి, మళ్ళీ తన తల మీదే అది పెట్టేసుగుంటూ 'తలమీదికి కంటె ఇతనికి పాదాలకి ఏదేనా ఇయ్యడం నయం' అని యెంచి, ఆమనిషిని మెల్లిగా

కూచోబెట్టి, తను తెచ్చిన అల్లికబూట్సు అతనిచేత తొడిగించి, 'మరి సరే, నేస్తం! కాస్త కదులు, కొంచెం వెచ్చపడు. కడం విషయాలన్నీ తరవాత తరవాత స్థిరపడతాయిలే,' అని 'అయితే, నువ్వు నడవగలవా?' అని ప్రశ్నించాడు. ఆమనిషి నిలబడి సమోనుకేసి సుముఖంగా చూశాడు, కాని ఒక్కమాటా ఆడలేక పోయాడు. సిమోను, 'మాట్లాడవేమి? ఇక్కడ చలి దుర్భరంగా ఉంది. మనం ఇల్లు చేరుకోవాలి. ఇదుగో కర్ర. ఇదుచ్చుగో. నీకు నీరసంగా ఉంటే దీని మీద ఆనుకో. మరి అడుగు వెయ్,' అన్నాడు. ఆ మనిషి నడవడం మొదలెట్టి, వెనకపడి పోకుండానే తంటాలు పడ్డాడు. వాళ్ళు వెడుతూండగా,

సి—నువ్వు ఎక్కడి వాడవు?

మ—ఈ ప్రాంతం కాదు.

సి—అంతా అనుకున్నాన్లే, నేను. ఇక్కడి జనాన్ని ఎరుగుదునుగా మరీ! కాని, నువ్వు ఆ గుడిదగ్గిరికి రావడం ఎట్లా సంభవించిందీ?

మ—నేను చెప్పలేను.

సి—ఎవడేనా నీకు కష్టం కలిగించాడా?

మ—ఎవడూ నాకు కష్టం కలిగించలేదు. దేవుడు నన్ను శిక్షించాడు.

సి—అది సహజమే. దేవుడు సర్వాన్నీ పాలిస్తాడుగా మరీ. అయినాసరే, నువ్వు ఎక్కడో అక్కడ తినడానికి తిండీ ఉండడానికి కొంపా చూసుగోవద్దూ? ఎక్కడికి వెళ్ళాలనుకుంటున్నావు?

మ—ఎక్కడికి వెళ్ళినా ఒకటే నాకు.

సిమోనుకి చాలా ఆశ్చర్యమైంది. ఆమనిషి తు ్రిలా కన పడడు, నెమ్మదిగా సంభాషిస్తాడు, కాని తనసంగతి ఏమిటో చెప్పడు. 'ఏం జరిగి ఉంటుందో ఎవరెరుగుదురు!' అనుకుని, సిమోను, అతనితో, 'సరే మరీ, నాతో మాయింటి కొచ్చెయ్. కాస్సేపేనా వెచ్చగా ఉందువుగాని' అన్నాడు. అని, సిమోను తన యింటికేసి నడవగా, పరాయివాడు అతని సరసనే జోడీగా అడుగువేసివెళ్ళాడు ఇంతలో ఒక గాలిరేగి. సిమోనుషర్టుకిందికి చలి దిగింది. అసలు సిమోనుకి తాగుడుమైకం కుడా ఈపాటి దిగజారి పోయిందేమో, చలివెయ్యడం అనేది అతనికి బాగా తెలియడం ప్రారంభించింది. నడుస్తూన్నప్పుడు అతడు ముక్కుతూ తను తొడుక్కున్న తన భార్య వూలుజాకెట్టు ఒత్తుగా లాక్కుంటూ, తనలో, 'మరి యింటికి వెళ్ళగానే!....ఏమిటి గొర్రె చర్మాలగురించి? గొర్రెచర్మాలకోసమే నేను అసలు వెళ్ళింది. కాని అవిలేవుసరిగదా ఉంటూన్నకోటు గుడా ఊడ కొట్టుగుని పైపెచ్చు ఓ దిగంబరుణ్ణికుడా పట్టుకొచ్చాను ఇంటి మీదికి. మట్రేనా ఇందుకు సంతోషించదు' అనుకుంటూవెళ్ళాడు, భార్యని తల్చుకోగానే దుఃఖం వచ్చింది. కాని ఆ పరాయివాడికేసి చూసి, అతడు గుడి దగ్గిర తనకేసి చూసిన మొదటి చూపు జ్ఞాపకం రాగానే, అతని హృదయానికి ఆనందం కలిగింది.

## iii

సిమోను భార్య ఆవేళ మరీ పెందరాళే సర్వమూ చక్క బెట్టింది. పుల్లలు కొట్టింది, నీళ్ళు తెచ్చింది. పిల్లలకి అన్న పెట్టింది, తనుతింది, ఆలోచిస్తూ కూచుంది. రొట్టె చెయ్యావ

సింది అప్పుడా మర్నాడా అనుకుంటోంది. తమరు తినగా పెద్దముక్క మిగిలి ఉంది. 'వెళ్ళిన ఊళ్ళో సిమోను ఎక్కడేనా తినుంటే, రాత్రి ఆట్టే తినడు. ఈ మిగిలిన ముక్కే మరో రోజు వస్తుంది,' అనుకుంది. ఆ ముక్క చేతులో మళ్ళీ మళ్ళీ ఎగరేసి చూస్తూ. 'ఈవేళకి మరి రొట్టి చెయ్యను. ఉన్న పిండిమాత్రం ఎంతా? మరోవాయి రొట్టెలకి వస్తుంది. ఈ ముక్క శుక్రవారందాకా సరిపోయేటట్టు చూసుగోవాలి, అని నిశ్చయించుగుని, ఆ ముక్క ఓచోటపెట్టేసి, ముగుడిపాత చొక్కా రప్పుతీస్తూ బల్లదగ్గిర కూచుంది. ఆ పనిచూస్తూ తన భర్త శీతకాలంకోటుకి చర్మాలు కొనుక్కొస్తాడనుకుంటోంది. 'వర్తకుడు ఈయన కంట్లో మెంతి చల్లకుండా ఉండాలిగా! ఈయన మరీ వెర్రిబాగులమనిషి. ఎవణ్నీ దగాచెయ్యలేడు, కాని ఏకుర్రాడైనాసరీ ఈయన్ని టోపీవెయ్యగలడు. ఎనిమిది రూకలంటే కాస్తాకూస్తానా!—అంతసొమ్ముకి మంచిరకం కోటే వస్తుంది. మరీ నునుపు చేసిన చర్మాలు రావుగాని, చలికోటుకి తగినవి వస్తాయి. వెచ్చటికోటు లేకుండా కిందటి శీతకాలం గడపడం ఎంత గగనం అయిపోయిందో! నేను నదికే వెళ్లలేక పోయాను. బయటికి ఎక్కడికీ కదల్లేకపోయాను. ఆయన బయటికి బయల్దేరితే, తనవీ నావీ అన్నీ తొడిగేసుగోవడమే, నాకేమీ మిగల్దు. ఈవేళంటే ఆయన మరీ పెంద్రాళే బయల్దేర లేదుగాని, ఈపాటికి తిరిగి రావలిసినమాటే. ఆయన తప్పతాగేసి ఉండకూడదనిమాత్రం ఆశిస్తున్నాను' అని ఆలోచించుగుంటూ ఉంది. మర్రేనా ఆలోచన ముగిసిందో లేదో గుమ్మందగ్గిర

అడుగులచప్పుడు వినపడింది. ఎవరో లోపలికివచ్చారు. ఆవిడ సూదిగుచ్చేసి చేతులోపని పక్కనెట్టి,నడవలోకి వచ్చింది. ఇద్దరు మనుషులున్నారు. సిమోను ఒకడు, టోపీలేకుండా అల్లికబూట్సు తొడుక్కున్న మరొకడు. తనభర్త తాగిరావడం మత్రేనా పసి కట్టేసింది. అదుగో, మళ్ళీ తాగి చక్కావచ్చాడనుకుంది. అతడు కోటులేకుండా తన జాకెట్టు తొడుక్కుని ఏమూటా పట్రాకుండా నోరు మెదపక సిగ్గుపడుతూ నుంచోడం చూసేసరికి ఆవిడకి కలిగిన ఆశాభంగంవల్ల గుండె పగిలిపోయేటట్టు తోచింది. 'వీడు సొమ్మంతా తాగేశాడు. ఆ తాగడంకుడా మరో దిక్కుమాలి చచ్చినాడితో చేరి. వాణ్ణి తీసుగుని ఇంటికి తగులడ్డాడు' అని ఆవిడికి అనిపించింది. ఆవిడ వాళ్ళని కొంపలో ప్రవేశించనిచ్చి, తనూవెళ్ళింది. పరాయివాడు యువకుడు, చిన్నవాడు, తన భర్తయొక్క నూలుకోటు తొడుక్కున్నాడు, టోపీ ధరించి లేడు. లోపల ప్రవేశించి, అతడు ఏమీ కదలకుండా దృష్టి యెత్తకుండా నిలబడి పోవడంచూసి, మత్రేనా, 'వీడెవడో దుష్టుడు—భయపడుతున్నాడు' అనుకుంది. వాళ్ళు ఏంజేస్తారో చూడాలనుకుని ఆవిడ పొయ్యిమిద్దెదగ్గిర కోపంతో నుంచుంది.

సిమోను తనటోపీ తీసేసి, సంగతులన్నీ చక్కగానే ఉంటూ న్నట్టు ఒక బెంచిమీద కూచున్నాడు. 'చూస్తావేం, మత్రేనా, భోజనం సిద్ధంగాఉంటే, పెట్టెసెయ్ మాకు' అన్నాడు. మత్రేనా తనలో తను ఏదో గొణుక్కుందిగాని, కదలకుండా, తను నిల బడ్డచోటే మిద్దెపక్కనే ఉంది. మొదట ఒకడికేసీ తరవాత వెంటోవాడికేసీ పరకాయించి తలపంకించింది. భార్య కోపంలో

పడ్డసంగతి సిమోను గ్రహించాడు. అది ఎట్లాగేనా పోగొట్టాలని యత్నించాడు. ఏదీ తను గమనించనట్టు నటిస్తూ, పరాయి మనిషిని చేత్తో పట్టుగుని, 'రా, నేస్తం, కూచో, కొద్దిగా భోంచేద్దాం' అంటూ అతణ్ణి బెంచిమీద కూచోపెడుతూ, 'మా కోసం ఏమీ వండలేదాయేమిటి?' అని ప్రశ్నించాడు. మత్రేనాకి కోపం సలసలలాడిపోయింది. 'వండకేం? నీకోసంమాత్రం వండలేదు. తప్పతాగేసి బుద్ధి పోగొట్టుగుని వచ్చినట్టు కనిపిస్తు న్నావు. గొర్రెచర్మంకోటుకోసం బయల్దేరినవాడవు, ఉంటూన్న కోటుకాస్తాకుడా లేకుండా ఇంటికి దయచేశావు, ఒక దిగంబరి తిరుగుబోతునికూడా తోలుకొచ్చావు. నీలాటి తాగుబోతులికి రాత్రిభోజనం లేదిక్కడ,' అంది. సిమోను, 'మరిచాలు, మత్రేనా, ఆగు, బుద్ధిలేకుండా నాలిక ఝాడించకు. అంతకంటె మంచిపని ఏమిటంటే, ఏరకం మనిషిని—' అని అంటూండగా, ఆమె, 'ముందు ఆడబ్బు ఎంజేశావోచెప్పు,' అంది. సిమోను జాకెట్టుజేబూలోంచి తను పట్టుగెళ్ళిన మూడురూకలూ తీసి అక్కడ పెడుతూ, 'ఇదుగో పట్టిగెళ్ళిన సొమ్ము, ఆరైతు బాకీ ఇయ్యలేదు. త్వరలోనే చెల్లిస్తానన్నాడు,' అని చెప్పాడు. మత్రేనా కోపం ఇంకా రేగింది. అతడు గొర్రెచర్మాలు కొని తేలేదు, గాని పాపం తనకోటు మరో దిగంబరి ఘటానికిచ్చేసి వాణ్ణి ఇంటికికుడా పిల్చుగువచ్చాడే! సరే. తరవాత ఎక్కడో భద్రంగా పెట్టచ్చుగదా అనుకుని బల్లమీది మూడురూకలూ గభుక్కుని తీసేసుగుని, ఆవిడ 'మీకు రాత్రిభోజనం నేను సిద్ధం చెయ్యలేదు. లోకంలోవుండే అడ్డమైన దిగంబరి తాగుబోతుల్ని

ఎక్కడ మేపగలం?' అంది. 'ఇదుగో, చెబుతున్నాను, మట్రేనా! కొద్దిగా నీ వాగుడు కట్టెయ్. మొట్టమొదట వినిపించుగో మరీ ఎవరేనా ఏంచెప్పదల్చారో-' అని సిమోను అడ్డువచ్చాడు. 'ఆఆ. తాగిన మూర్ఖుడిదగ్గిర్నించి తత్వంఎంతేనా వినబోతున్నాను. తాగుబోతువి గనక నీతో పెళ్ళి నేను మొదట కోరుకోకపోవడం ఎంతో ఒప్పైన సంగతి, మా అమ్మ నాకు పెట్టిన బట్టలన్నీ తాగేశావు, ఇప్పుడు కోటు కొంటానంటూ వెళ్ళి—అదీ తాగేశావు,' అంది, పాపం సిమోను తను ఇరవై చిన్నడబ్బులు మాత్రమే ఖర్చు చేశానని అవిడికి విశదపరుద్దామని చూశాడు, ఆ మనిషి తనకి కనిపించిన పరిస్థితులు చెబుదామనీ యత్నించాడు—కాని మట్రేనా ఎంతమాత్రమూ అతనిమాట చొరనియ్యకుండా అతడు నోరు మెదిపేసరికి తను తొంభై ఏకరు వెడుతూ, పదేళ్ళక్రితం నాటి ముచ్చట్లుకూడా ఈడ్చుకొస్తూ వాగేసింది. అమె వాగి వాగి సిమోను కేసి పరిగెత్తి అతడి చొక్కాచెయ్యి లాగి పట్టుగుని, 'నా జాకెట్టు నాకిచ్చెయ్. నా కుంటా అదొక్కటే, అదొక్కటీ నా దగ్గిర్నించి పుచ్చుగుని నువ్వే తొడుక్కోడం నీ కెప్పుడూ అవసరమే. అది ఇల్లా ఇచ్చెయ్, కుళ్లుకుక్కా! తరవాత నిన్ను ఏ సైతాను వేసుగుపోయినా సరే!' అంది. సిమోను ఆ జాకెట్టు విడవడానికి ఓ చెయ్యి తిరగదీశాడు. ఆ మట్టున మట్రేనా అది పట్టుగుని లాగేసరికి దానికుట్లు పిగిలిపోయాయి. అది పోగుచేసి తన నెత్తిని వేసుగుని అమె తలుపు దగ్గిరికి వెళ్ళింది. బయటికి పోవాలని సంకల్పించిందిగాని నిశ్చయ్యానికి రాలేక ఆగింది—తన కోపాన్ని చివరంటా పోనియ్యా

అనే ఆవిడ ఉద్దేశంగాని, వచ్చిన పరాయివాడి రకం ఏమిటో కనిపెట్టాలని కుడా ఆవిడికి ఉంది,

## iv

మత్రేనా అగి, 'అతడు మంచి వాడైతే దిగంబరిగా ఎందు కుంటాడూ? అబ్బెబ్బే, ఒక షర్టైనా ఓంటిమీదలేదే! పోనీ. అతడు సరియైన వాడైతే, నీ కెక్కడ తారసిల్లాడూ?' అని అడిగింది. దానికి సిమోను 'అచ్ఛంగా ఆ మాటే నేను నీతో చెప్పబోతూంటా. నేను గుడిని సమీపిస్తూ ఇతడు దిగంబరిగా చలికి నిశ్చేష్టుడై కూచోడం చూశాను. ఆరుబయట వస్త్రం లేకుండా కూచోడానికి అనువైన శీతలమా ఏమన్నానా? అక్కడికి నన్ను దేవుడు లాక్కెళ్లాడు, లేకపోతే ఇతడక్కడ నశించే వాడే. అప్పుడు నేను ఏమిటి చెయ్యడం? ఇతనికి లోగడ ఏమేమి జరిగిందో ఎట్లా మనికి తెలియడం? అందుకని, ఇతణ్ణి లేవదీసి, నా కోటు తొడగబెట్టి, నాకూడా తీసుగు వచ్చేశాను, అంత కోపపడకు, మత్రేనా, అది పాపం, జ్ఞాపకం ఉంచుగో. మనం అంతా ఏదో రోజుని గతించి తీరాలి' అన్నాడు.

కోపంకురిపించే మాటలు మత్రేనా నాలిక చివరికి వచ్చాయి. కాని, ఆమె ఆ పరాయి మనిషికేసి చూసి. ఊరుకుంది. అతడు చలనంలేకుండా చేతులు మోకాళ్ళమీద అనుకుని, తల ఛాతీమీద వాలిపోతూ, మూసిన కళ్ళతో, బాధలోలాగ బొమముడితో. బెంచీ చివర కూచున్నాడు. మత్రేనా ఊరుకునే ఉంది. సిమోను, 'మత్రేనా! దేవుడంటే నీకు ప్రేమలేదా?' అన్నాడు. ఈ మాటలు మత్రేనా విని ఆ పరాయివాణ్ణి చూసింది. చూసిన

తక్షణం అతని యెడల ఆమె హృదయం కరిగింది. ద్వారం దగ్గర్నించి ఆమె వెనక్కి వచ్చేసింది. మిద్దె దగ్గిరికి వెళ్ళి ఆహారం తెచ్చింది. బల్లమీద కప్పుపెట్టి దాన్లో ఒక పానీయం పోసింది, మిగిలిఉన్న రొట్టెముక్క తెచ్చి అక్కడపెట్టి, చాకూ చమ్చాలూ అమారుచేసింది. 'తినండి, కావలిస్తే' అంది. సిమోను పరాయివాణ్ణి బల్లదగ్గిరికి తీసిగెడుతూ, 'వచ్చికూచో, అబ్బాయి' అని, రొట్టెని చిన చిన్న ముక్కలుగాచేసి మాంసపు చారులో వేశాడు. వాళ్లు తినడం ప్రారంభించారు. మత్రేనా మోచేతులు బల్లమీదపెట్టి చేతుల్లో తల ఆన్చి పరాయి వాడికేసి చూస్తూ బల్లకి ఒక చివర కూచుంది. అప్పుడు మత్రేనాకి ఆ పరాయి మనిషిమీద కనికరం కలిగి ఆప్యాయంకుడా బయల్దేరింది. తక్షణం ఆ పరాయిమనిషి మొహం శోభాయమానం అయింది. అతని బొమముడి పోయింది. దృష్టియెత్తి మత్రేనాని చూస్తూ అతడు చిరునవ్వు నవ్వాడు. భోజనానంతరం బల్ల శుభ్రంచేసి పరాయిమనిషిని ప్రశ్నించడం మొదలెట్టింది,

మ—నీ రాక ఎక్కణ్ణించి ?

ప—ఈ ప్రాంతం కాదు.

మ—నువ్వు రోడ్డుమీదికి ఎట్లా వచ్చిపడ్డావు ?

ప—నేను చెప్పరాదు.

మ—ఎవడేనా నిన్ను దోచుగున్నాడా ?

ప—దేవుడు నన్ను శిక్షించాడు.

మ—అక్కడ దిగంబరివై పడిఉన్నావా ?

ప—మరే, ధిగంబరినై కర్రబారిపోయి కుడానూ ! సిమోను నన్ను చూసి కనికరం చాల్చాడు. తన కోటు విడిచి, నాకు

తొడిగి, నన్నిక్కడికి తీసుకువచ్చాడు. మీరు భోజనంపెట్టి పానీయంఇచ్చి నామీద కనికరం చూపించారు. దేవుడు మిమ్మల్ని మెచ్చుతాడు.' అన్నాడు. మత్రేనా లేచి కిటికీదగ్గిరికి వెళ్ళి తను బాగుచేస్తూన్న సిమోను పాతషర్టు తెచ్చి, పరాయిమనిషికి ఇచ్చింది. అతనికోసం ఒక పాత లాగూ కుడా ఎల్లానో పుట్టించింది. 'చూడూ! నీకు షర్టు లేనట్టుంది, ఈ షర్టు తొడుక్కో. తొడుక్కుని అటకగదిలోనేనా సరే వేడిమిద్దెమీదేనా సరే పడుకో, నీ యిష్టం' అంది. పరాయిమనిషి తన ఒంటిమీద కోటుతీసేసి, షర్టు తొడుక్కుని అటకగదిలో పడుకున్నాడు. మత్రేనా కొవ్వొత్తి ఆర్పేసి, కోటుతీసుగుని, తన భర్త అది వరకే ఎక్కిపడుకున్న మిద్దెమీదికి వెళ్ళింది. మిగిలున్న రొట్టె కాస్తా అయిపోడమూ, మర్నాటికి ఏమీ లేకపోడమూ, పాత షర్టూ పాతలాగూ ఇచ్చెయ్యడమూ ఆవిడికి జ్ఞాపకంరాగానే, ఆవిడ బాధపడింది. కాని ఆ పరాయిమనిషి చిరునవ్వు నవ్వడం జ్ఞాపకం రాగానే, ఆవిడ హృదయానికి ఆనందం కలిగింది. మత్రేనా ఎంతో సేపటిదాకా మెళుకువగానే ఉంది. సిమోను కుడా మెళుకువగానే ఉన్నట్టు ఆవిడ కనిపెట్టింది—అతడు ఉమ్మడి కోటు తన వేపు లాక్కుంటూండడం బట్టి.

మ—సిమోన్!

సి—ఓయ్.

మ—రొట్టె యావత్తూ అయిపోయింది. మరోటి తయారవడానికి నేను ఆయత్తం చెయ్యలేదు. రేపు మనం ఏంజెయ్యవలిసుంటుందో నాకు తెలియడంలేదు. పోనీ మన పొరుగింటి మార్తా దగ్గిర బదులుచ్చుగుంటాను.

సి—రేపటిదాకా బతికుంటే, తినడానికి ఏదో ఒకటి చూద్దాం లేస్తూ.

మ—(కొంచెంసేపు నిశ్శబ్దంగా పడుకుని, మళ్ళీ) అతడు మంచివాడులాగే కనిపిస్తాడు. కాని, తనెవడో చెప్ప డెందుచేతనో?

సి—చెబితే అతనికేమి చిక్కో, అవి నా ఊహ,

మ—సిమోన్ !

సి—ఓయ్.

మ—మనమంటే ఏదో ఇచ్చాంగదా. మనికంటే ఎవ్వరూ ఏమీ ఇవ్వరేం?

ఇందుకేం సమాధానం చెప్పాలో సిమోనుకి తోచక, 'అబ్బ, మనం ఇక మాట్టాడం మానేద్దాం పట్టు!' అనేసి, అటుకేసి తిరిగి, సుబ్బరంగా నిద్రపోయాడు.

V

పొద్దున్నే సిమోను లేచాడు, పిల్లలింకా పడుకునే ఉన్నారు, అతని భార్య పొరుగింటికి రొట్టెబదులుకి వెళ్ళింది., పాత షర్టూ పాతలాగూ తొడుక్కుని పైకి చూస్తూ పరాయిమనిషి ఒక్కడూ బెంచిమీద కూర్చున్నాడు. క్రితం రోజుకంటె అతని మొహం ఎక్కువ కళగాఉంది. సిమోను అతనితో, 'చూడు, నేస్తం! పొట్టకి రొట్టె కావాలి, శరీరానికి దుస్తులు కావాలి. బతగాలంటే ఎవడేనా పనిచెయ్యాలి. ఏ పని నీకు తెలుసునూ?' అన్నాడు. అతడు 'ఏపనీ తెలియదు నాకు' అని సమాధానం చెప్పాడు. సిమోను ఆశ్చర్యపడి, 'ఎవళ్ళకేనా నేర్చుగోవాలని ఉంటే ఏమిటైనా నేర్చుగోవచ్చు' అన్నాడు. 'మనుష్యులు పని

చేస్తారు, నేను కుడా చేస్తాను' అని పరాయిమనిషి చెప్పాడు. సిమోను, 'నీ పేరేమిటి ?' అని అడిగాడు. అతడు, 'మైకేలు' అన్నాడు. 'చూడు, మైకేల్! నీ విషయం గురించి చెప్పడం నీకు ఇష్టం లేకపోతే, పోనీ. అది నీ స్వంత వ్యాపారం! కాని, నీ స్వంతానికి బతుకుతెరువు ఏదో ఉండాలి. నే చెప్పిన పని చేస్తే, నీకు తిండీ పెడతాను, బసా యిస్తాను' అని సిమోను సలహా చెప్పాడు. 'దేవుడు మిమ్మల్ని మన్నించుగాక! విధిగా నేర్చుగుంటాను. ఎంజెయ్యాలో చెప్పండి' అని అర్థించాడు. సిమోను దారపుండ తీసి బొటనవేలుకి చుట్టుచుట్టి పేనడం మొదలెట్టాడు. 'ఇది చాలా తేలిక—చూశావా?' అన్నాడు. మైకేలు అదంతా జాగర్తగా కనిపెట్టి, తన బొటనవేలుకి అల్లా దారం చుట్టపోసి, దాల్లో ఉండే సుళువు గ్రహించి, తనూ పేని చూపించాడు. తరవాత అతనికి సిమోను దానికి మైనం రుద్దడం నేర్పాడు. ఇది కుడా మైకేలు పూర్తిగా నేర్చాడు. ఆ పైని అతనికి సిమోను బెజ్జంలో దారపు మొన గుచ్చడమూ కుట్టడమూ చెప్పాడు. ఇవీ అతడు వెంటనే నేర్చేశాడు. సిమోను ఏ మోస్తరు చూపించినా అతనికి తక్షణం తెలిసేది. మూడు రోజులు గడిచే సరికి అతడు జీవితమంతా చెప్పులు కుట్టేవాడు లాగ పనిచెయ్యడం మొదలెట్టాడు. అతడు ఆగకుండా పని చేసేవాడు, కాని, తిండిమాత్రం అల్పంగా తినేవాడు. పని పూర్తి అయింతరవాత, ప్రశాంతంగా కూచుని, పైకి చూస్తూండేవాడు. అతడు ఎన్నడూ వీధులోకి వెళ్ళలేదు, అవసరానికి మాత్రమే మాట్లాడేవాడు. వేళాకోళాలు చేసిగాని, నవ్విగాని ఎరగడు,

మొదటినాడు మ(తేనా అతడికి భోజనం పెట్టినప్పుడు అతని చిరునవ్వు తప్ప, అతడు నవ్వడం వాళ్లు చూణ్ణోలేదు.

vi

రోజుతరవాత రోజూ వారంతరవాత వారమూ గడిచి సంవత్సరం గి(రున తిరిగింది. సిమోన్‌యొక్క ఇంటో తింటూ అతనికింద పనిచేస్తున్నాడు మైకేలు. మైకేలుపేరు వ్యాపించింది. సిమోనుకింద పనిచేసే ఆ మైకేలు కుట్టినంత ముచ్చటగానూ గట్టిగానూ చెప్పులు మరెవడూ కుట్టలేడని జనం చెప్పుగోడం మొదలెట్టారు. ఆ జిల్లా అంతనించీ చెప్పులు కుట్టించుగునే నిమిత్తం జనం సిమోను దగ్గిరికి రావడంతో, సిమోనుపని బాగుపడింది. శీతకాలంలో ఒకనాడు సిమోనూ మైకేలూ పనిచేసుగుంటూ కూర్చుండగా, చ(కాలులేని ఒక మూడుగు(రాల మంచుబండి గంటలుమోగుతూ గుడిసెయెదటిదాకా వచ్చి ఆగింది. వాళ్ళు కిటికీలోంచి చూశారు. వాళ్ళ యింటిముందే ఆబండి ఆగుతా. నౌకరుగాఉన్న ఒక బం(ట్రోతు తన పీఠందిగివచ్చి బండితలుపు తెరిచాడు. ఉన్నికోటు తొడుక్కున్న ఓ ఘరానావాడు బండిదిగి సిమోను గుమ్మంకేసి నడిచివస్తున్నాడు. చంగున ఉరికివెళ్లి మ(తేనా వీధితలుపు భార్లాతీసింది. ఆ ఘరానావాడు బాగావంగితే గాని గుడిసెలో (పవేశించలేకపోయి, (పవేశించిన తరవాత నిటార్గా నుంచున్నప్పుడు పై అటక తగిలేటట్టున్నాడు. అతడున్నవైపు గది సందులేకుండా నిండిపోయినట్టు కనిపించింది. సిమోను లేచి, వంగి నమస్కరించి, ఆ ఘరానావాడికేసి తెల్లబోయి చూస్తూ నుంచున్నాడు. అసలిలాంటివాణ్ణి సిమోను

ఎన్నడూ చూడలేదు. తను కదురులాగ సన్నంగా ఉన్నాడు, మైకేలు పల్చగా తాటాకులాఉన్నాడు, మ(త్రేనా ఎండిపోయి ఎముకలాఉంది కాని, ఆమనిషేమిటీ? మరో(ప్రపంచంవాడులా ఉన్నాడు, జేగురుమొహం వేసుగుని దుక్కలాగ ఆంబోతు మెడతో ఇనపపోతవి(గహంలా కనిపించాడు. అతడు రొజు కుంటూ ఉన్నికోటు తీసిపారేసి, బెంచిమీద కూచుని, 'ఎవరిక్కడ చెప్పులుకుట్టేవాళ్ళలో పెద్ద?' అని అడిగాడు. సిమోను ముందుకి వచ్చి 'నేనేనండి, మహాశేతా!' అన్నాడు. ఘరానావాడు తన కు(రనౌఖర్ని కేకేసి, 'ఒరేయ్, ఆచర్మం ఇల్లా పట్రా!' అన్నాడు. వాడు ఒక కట్టపట్టుగుని లోపలికి పరిగెత్తుగువచ్చాడు. ఘరానావాడు ఆకట్ట పుచ్చుగుని బల్లమీద ఉంచాడు. 'కట్టవిప్పు' అన్నాడు, కు(రాడు ఆకట్ట విప్పాడు. ఘరానావాడు ఆచర్మంకేసి చూపిస్తూ, 'ఇదుగో గొడారీ! ఈచర్మం చూస్తున్నావా?' అని అడిగాడు. 'చిత్తం, చూస్తున్నాను, మహాఘరానా!' అని సిమో నన్నాడు. 'కాని, ఇది యేరకం చర్మమో నీకు తెలుసా?' అని ఘరానావాడు (ప్రశ్నించాడు. సిమోను చర్మంపట్టిచూస్తూ, 'మంచి చర్మమండి' అన్నాడు. 'మంచిదా? ఇంతే? ఓరిమూర్ఖుడా, నీజన్మలో ఎప్పుడేనా చూసేడిశావా ఇల్లాంటిదీ? ఇది జర్మనీది, దీని ఖరీదు ఇరవైరూకలు' అని ఘరానావాడన్నాడు. సిమోసు హడిలిపోయి, 'ఇల్లాంటి చర్మం చూడ్డం నాకెప్పుడు పడుతుందీ?' అన్నాడు. 'అదే, నేననేమాట. దీంతో నాకు బూట్సు కుట్టిపెట్ట గలవా?' అని ఆయన అడిగాడు, 'చిత్తం, మహాశేతా! కుట్ట గలను,' అని సిమోనన్నాడు. ఆమాటతో, ఘరానావాడు పెద్ద

గొంతిగెట్టుగుని, 'కుట్టగలవుకాదూ! అల్లాగా? అయితేసరే. ఎవరికి కుడుతున్నావో జ్ఞాపకం ఉంచుగో, ఎటువంటి చర్మం కుడుతున్నావో జ్ఞాపకం ఉంచుగో. నువ్వు నాకు కుట్టియిచ్చే బూట్సు సంవత్సరంలోపల రూపం చెడకుండా కుట్లు విడకుండా మన్నాలి. అది నీకు శక్యమైతే, యిదుగో పుచ్చుగో చర్మం. కత్తిరించు. అల్లాకాక, నీకు శక్యంకాదా, ఆసంగతి చెప్పేయ్. ముందుజాగ్రత్తకి చెబుతున్నాను, సంవత్సరంలోపల రూపం చెడకుండా కుట్లు విడకుండా నువ్వు కుట్టేబూట్సు మన్నకపోతే. నిన్ను ఖైదుచెయిస్తాను. కాని, సంవత్సరంలోపల రూపం చెడకుండా కుట్లు విడకుండా అవి ఉంటే, నీపనికి పదిరూకలిస్తాను. అన్నాడు. సిమోనుకి తారెత్తిపోయి, ఏమనడానికీ తెలియకుండా అయాడు. మైకేలు కేసి ఓచూపు పారేసి, వెళ్ళి అతణ్ణి మోచేత్తో తాకుతూ, 'ఈపని అచ్చుగోమంటావా?' అని అతడి చెవులో అడిగాడు. అచ్చుగోండన్నట్టు మైకేలు తల ఊగించాడు. మైకేలు సలహాచొప్పున సంవత్సరంలోపల రూపం చెడకుండా కుట్లు విడకుండా ఉండేబూట్సు కుట్టడానికి సిమోను అచ్చుగున్నాడు. తన నౌఖర్ని పిలిచి ఘరానావాడు తన ఎడమకాలి బూటు ఊడ లాగించి, ఆ కాలుసాచి, సిమోనుతో 'అది కొల్చుగో 'అన్నాడు. సిమోను, కాగితపుముక్కలు అతికించి పదిహేడంగుళాల పీలిక చేసి, దాన్ని సాపుచేసి, మోకరించి, ఆ ఘరానామనిషి కాలికున్న నూలు తొడుగు మాసిపోకుండా తనచేతులు తుడుపురుమాల్తో ట్టి తుడిచేసుగుని, కొలవడం ప్రారంభించాడు. అరికాలు కొల్చాడు. పాదంమధ్యచుట్టు కొలతతీశాడు, తరవాత కాలిపిక్క కొలవాలని

యత్నించాడు. కాని, ఆకాగితపుపీలిక సరిపోతేనా : ఆమనిషి కాలి పిక్కదూలంపరిమాణంలోఉంది, 'కాలిపొడుగునా బిగుతయేటట్టు కుడతావేమో స్మీ, జాగ్రర్త' అంటూ ఘరానావాడు హెచ్చరించాడు. మరో కాగితపుముక్క అతికించి, సిమోను కొలత పూర్తిచేశాడు. ఘరానావాడు తన కాలి నూలు తొడుగులో వేళ్ళు కదిలిస్తూ చుట్టుపక్కల అంతటా చూశాడు. ఆచూసే టప్పుడు మైకేలు కనిపించాడు. 'అక్కడ ఉన్నా వారెవరూ?' అని ఘరానావాడడిగాడు. 'నా పనిమనిషి. అతడే బూట్సు కుట్టేది' అని సిమోను జబాబు చెప్పాడు. ఘరానామనిషి మైకేలుతో, 'జాగ్రర్త, రా. కుట్టేటప్పుడు జ్ఞాపకంపెట్టుగో, అవి నాకు సంవత్సరం రావాలి' అన్నాడు. సిమోను కుడా మైకేలుకేసి చూశాడు. కాని, మైకేలు ఘరానామనిషికేసి చూడడమేలేదు, ఆ ఘరానామనిషి దిశలో వెనకభాగంలో ఒక మూల ఎవరో తనకి కనపడుతూన్నట్టు తదేక దృష్టిలో ఉన్నాడు. అల్లా చూసి చూసి అతడు హఠాత్తుగా చిరునవ్వు నవ్వాడు, అతని ముఖం ఇంకా కలకల లాడిపోయింది. 'ఏం చూసిరా, అల్లా యికిలిస్తున్నావు, మూర్ఖా?' అంటూ ఘరానామనిషి ఉరుముతూ, 'బూట్సు సకాలంలో తయూరు చెయ్యాలని గుర్తుంచుగో, ఎందుకేనా నయం,' అన్నాడు. 'ఉచితకాలానికి సిద్ధంగా ఉంటాయి,' అని మైకేలు అన్నాడు. ఘరానామనిషి, అట్లాజరిగేటట్టు జాగర్త పడాలని వాళ్ళని ఆజ్ఞాపించి, తన బూట్సు తొడుక్కుని, ఉన్ని కోటు తన శరీరానికి చుట్టబెట్టుగుని, వీధిద్వారం దాటుతూ, వంగడం మరిచిపోగా, అతని తల ద్వారబంధం కమ్మికి ఠకీమని తగిలింది. అతడు తిట్టుగుని, తలరాచుగుని, బండిలో కూర్చో

పడి, బండితోలింపించుగుని వెళ్ళిపోయాడు. అతడువెళ్ళిపోగానే, సిమోను, 'మనిషిని చూడవలిసొస్తే, ఈ మనిషిది విగ్రహం! సుత్తితో కొట్టికుడా ఈ మనిషిని చంపలేం. ద్వారబంధం కమ్మి ఊడి అవతల పడేటంత పనిజరిగిందిగాని ఇతని తల చెక్కు చెదరలేదు' అంటూ అతణ్ణి వర్ణించాడు. మత్రేనా, 'ఈ మనిషి జీవిస్తూన్న రీతిగా జీవిస్తే, తెగబలిసిపోక ఏం జేస్తారూ? ఇల్లాంటి పర్వతాన్ని ముట్టుగోడానికి మృత్యువుకి కుడా శక్తి ఉండదు' అంది.

## vii

తరవాత, సిమోను మైకేలుతో, 'సరే ఇక్కడికి, ఈ పని అచ్చుగున్నాం గనక, దీన్నిగురించి చిక్కుల్లో పడకుండా బయట పడేటట్టు చూసుగోవాలి, చర్మం ఖరీదైనది, ఘరానా మనిషి కోపధాటి రకం, మనం ఏమీ పొరపాట్లు రానియ్యకూడదు. విన్నావా? దృష్టి నాకంటె నీకు బాగా ఆనుతుంది, నా వేళ్ళకంటె నీ వేళ్ళే ఎక్కువ చురుకు అయినాయి, అందుకని, నువ్వు ఈ ఆది తీసుగుని, బూట్సుకి చర్మం కొయ్యి. కుట్టు నగిషీలు నేను పూర్తిచేస్తాను' అన్నాడు. మైకేలు అల్లానే చేశాడు. చర్మం పుచ్చుగుని, అది బల్లమీద పరిచి, జమిలిగా మడిచి, కత్తితీసి కొయ్యడం మొదలెట్టాడు, మత్రేనావచ్చి అతడు కొయ్యడం నిదానిస్తూ చూసింది. అతడు కోసేరీతికి ఆశ్చర్యపడింది. బూట్సు కుట్టే విధానం చూస్తూండడం ఆవిడికి అలవాటే. అయినా మైకేలు ఆ చర్మాన్ని బూట్సు నిమిత్తం కోస్తూన్నట్టు కనపించడంలేదు ఆవిడికి—గుండ్రగుండ్రంగా

కోసేస్తున్నాడు. ఆవిడ ఏదైనా మాట్లాడదామా అనుకుని, మళ్ళీ తనలో, 'ఘరానా మనుషుల బూట్సు ఎల్లా చేస్తారో యేమో, నాకేం తెలుసూ? నాకంటె మైకేలుకి ఎంతో ఎక్కువగా తెలుసునని నా అభిప్రాయం, నేను అడ్డువెళ్ళను' అనుకుంది. చర్మం కోతపూర్తిచేసి, మైకేలు దారం పుచ్చుగుని దాన్తో బూట్సు కుట్టేటప్పటి రెండుచివళ్ళకుట్టు కుట్టక ఒంటి చివర కుట్టే మెత్తస్లిప్పర్లకి కుట్టినట్టు కుడుతున్నాడు. మళ్ళీ ఆశ్చర్యపడింది, మత్రేనా. కాని, అడ్డు వెళ్ళకుండా మళ్ళీ ఊరుకుంది. మైకేలు అల్లా నిదానంగా మిట్టమధ్యాహ్నందాకా పనిచేశాడు. సిమోను పగటి భోజనానాకి లేస్తూ, చుట్టూచూసి, ఆ ఘరానా మనిషి యిచ్చిన చర్మంతో మైకేలు స్లిప్పర్లు తయారు చెయ్యడం చూశాడు. అతడు మూలుగుతుంటూ తనలో, 'అయ్యో! నాతో ఉంటూన్న ఈ సంవత్సరాన్నించీ ఒఖ్ఖ పొరపాటేనా చెయ్యని మైకేలు ఇప్పుడింత ఘోరమైన పని చెయ్యడం ఎల్లా జరిగింది చెప్మా? ఆ ఘరానామనిషి మాకు ఇచ్చిన బేరం మోకాలిదాకా ఉండే బూట్సు, అడుగు అట్టకి అడ్డుబిగింపుతో, పైఅట్టకి అతుగు రానీకుండా, కుట్టాలని. కాని, మైకేలు ఒంటిఅట్ట మెత్తటి స్లిప్పర్లు కుట్టేసి, చర్మం వ్యర్థంచేసేశాడు. ఏమిటి ఆ ఘరానా మనిషితో నేను చెప్పడం? పోనీ నా జన్మలో ఇల్లాంటి చర్మం కొని ఆయనకి ముదరా ఇయ్యగలనా?' అనుకున్నాడు. అతడు మైకేలుతో, 'ఏం చేసేశావ్, నేస్తం? నన్ను నాశనం చేసేశావు, ఆ ఘరానామనిషి బేరం ఇచ్చింది పెద్ద బూట్సుకి, కాని, చూడు నువ్వు తయారు చేసిందేముటో!' అన్నాడు. అతడు మైకేల్ని

యిల్లా మందలించ బోతున్నాడో లేదో గబగబా వీధి తలుపు కొట్టిన చప్పుడైంది. వాళ్ళు కిటికీలోంచి చూశారు. ఒకడు గుర్రంమీద వచ్చి దిగి, గుర్రాన్ని కట్టేస్తున్నాడు. వాళ్లు తలుపు తీశారు. ఘరానా మనిషితో వచ్చిన నౌఖరే. అతడు లోపలికి వచ్చి 'సుదినం' అన్నాడు. 'సుదినం' అని సిమోను బదులు చెప్పి, 'ఏమిటి సెలవు?' అని అడిగాడు. 'మా యజమానురాలు బూట్సు విషయంలో నన్ను పంపించారు' అని ఆ నౌఖరన్నాడు. 'బూట్సు విషయంలో ఏమని?' అని సిమోను కనుక్కున్నాడు. 'ఏముందీ? మాయజమానికి బూట్సు అవసరం లేదు. ఆయన మరణించాడు,' అని అతడు చెప్పాడు. 'అంత పని సంభవనీయమా?' అని సిమోను నివ్వెరపోయాడు. 'అబ్బే, మిమ్మల్ని విడిచిపెట్టిం తరవాత ఇల్లుచేరుకునేదాకానేనా ఆయన బతగందే! బండిలోనే పోయాడు. బండి ఇల్లు చేరగానే నౌఖర్లంతా ఆయన్ని దింపించుదామని వచ్చేసరికి ఆయన ఒక మూటలా దొర్లిపోయి ఉన్నాడు. తత్పూర్వమే ఆయన మరణించి ఎల్లా బిగిసిపోయా డనుకున్నారు, బండిలోంచి కళ్లైని బయటికి తియ్యడం ఎంతోకష్టం అయింది. మా యజమానురాలు నన్ను ఇక్కడికి పంపుతూ; "గౌడారితో చెప్పు. బూట్సుకి ఆర్డరు ఇచ్చి చర్మం పడేసి వెళ్లిన ఘరానా మనిషికి ఆ బూట్సుయొక్క అవసరం మరిలేదు. కాని, వారి శవానికి మెత్తటి స్లిప్పర్లు చేసి తక్షణం ఇయ్యాలి. అవి అయేవరకూ ఉండి, ఎంతవుతుందో ఇచ్చి, నువ్వే పట్టుగురా, "అన్నారు. అందునిమిత్తం నేవచ్చాను' అంటూ ఆ నౌఖరు సంగతులు విశదం చేశాడు. మైకేలు మిగి

లిన చర్మం పోగుచేసి చుట్టచుట్టి, తను తయారు చేసిన మెత్తటి స్లిప్పర్లు పైకి తీసి, వాటిని ఒకమాటు తప్పుమనిపించి తన తుడుపుగుడ్డతో వాటిని రుద్ది, ఆ జతా చర్మంచుట్టూ ఆ నౌఖరుకి ఇచ్చెయ్యగా వాడు అవి తీసుగుని, ఓ రూక సిమోను చేతులో వేసి, 'సెలవండీ, అయ్యా సెలవు. షుభదినం' అంటూ వెళ్ళిపోయాడు.

## viii

మరో సంవత్సరం గడిచింది మరోటి, మరోటి. మైకేలు సిమోను ఇంట్లోచేరి ఆరోయేడు జరుగుతూంది. మైకేలు ఎప్పటి లాగే ఉన్నాడు. ఎక్కడికీ వెళ్ళడు, అవసరమప్పుడు మాత్రమే మాట్లాడతాడు, అన్ని యేళ్ళకీ రెండుసార్లు మాత్రమే చిరునవ్వు నవ్వాడు —మత్రేనా తనకి ఆహారం పెట్టినప్పుడు మొదటిసారి, ఘరానామనిషి గుడిసెకివచ్చి నప్పుడు, రెండోసారి. తన పని వాడంటే సిమోనుకి ఎంతో తృప్తికలిగింది. నువ్వెక్కణ్ణుంచి వచ్చావని మైకేల్ని అడగడం మరి మానేశాడు సిమోను. మైకేలు తీరా వెళ్ళిపోతాడేమోగదా అని సిమోనుకి భయం పట్టుగుంది.

ఒకనాడంతా ఇంటిదగ్గిరేఉన్నారు. ఇనపబిందెలు కుంపటి మీద పెడుతోంది మత్రేనా, పిల్లలు బెంచీలమీద పరుగులెత్తుతూ కిటికీల్లోంచి చూస్తున్నారు, ఓ కిటికీదగ్గిర సిమోను కుట్టుకుంటు న్నాడు. మరో కిటికీదగ్గిర మైకేలు చెప్పుకి అడుగుఅట్ట బిగిస్తు న్నాడు. ఒక కుర్రాడు బెంచిమీద పరిగెత్తి మైకేలు దగ్గిరికివెళ్ళి అతణ్ణి భుజంమీద ఆని కిటికీలోంచి చూస్తూ, 'చూడుచూడు

మైకేల్‌బాబూ! ఒక ఆవిడ, ఆవిడకూడా ఇద్దరు అమ్మాయిలు. ఆవిడ ఇల్లానే వస్తూన్నట్టుంది. ఒక అమ్మాయి కుంటుతోంది' అన్నాడు, ఆ బాలుడు అల్లా అనగానే. మైకేల్ తన చేతులోపని పడేసి, కిటికీకేసి తిరిగి, అందులోంచి వీధికేసి చూశాడు. సిమోను ఆశ్చర్యపడ్డాడు. మైకేలు ఎన్నడూ వీధికేసి చూడడం అలవాటులేనివాడు, ఇప్పుడు కిటికీమీదపడి, ఏమిటో రెప్ప వెయ్యకుండా చూస్తున్నాడు. సిమోనూ చూశాడు. మంచి దుస్తులు ధరించిన ఒకస్త్రీ ఉన్నికోట్లూ ఊలుమెడచుట్టూ గల ఇద్దరు అమ్మాయిల్ని వెంటనడిపించుగుంటూ తన గుడిసెలోకే వచ్చింది. ఆ అమ్మాయి లిద్దరూ ఇదెవరో అదెవరో మనం చెప్పుగోలేనట్టున్నారు. కాని, ఒక అమ్మాయి ఎడంకాలితో కొంచెం కుంటుతోంది. ఆస్త్రీ ఎదరఖాకిట్లోంచి నడవలోకి వచ్చింది. ప్రవేశం ఎల్లాగా అనుకుని ఆమె ఒక మీట కనిపెట్టి పైకెత్తేసరికి, తలుపు తెరుచుగుంది. అమ్మాయి లిద్దర్నీ ముందే లోపలికిపంపి, తరవాత తను వెళ్ళింది. 'సుదినం, సజ్జనులారా!, అంది, 'దయచేసి లోపలికిరండి. ఏమిటి సెలవు?' అన్నాడు సిమోను. ఆమె బల్లపక్కకూచుంది. కొత్తవాళ్ళంటే భయంవేసి ఆ చిన్నపిల్లలు ఆవిడ మోకాళ్ళంటిపెట్టుగున్నారు. 'ఈ వసంతంలో విహారానికి ఈ అమ్మాయిలిద్దరికీ చర్మం చెప్పులు కుట్టి పెట్టాలి,' అని కోరింది ఆమె. సిమోను 'ఓ. అల్లానే. ఇంత చిన్నవి ఎన్నడూ కుట్టలేదుగాని, కుట్టగలం—జమిలి అట్టవీ, మూలంచుఉండి తిరగాబోర్లా వచ్చేవీనూ. నాపనివాడు, ఈ మైకేలు, అవి కుట్టడంలో పూర్ణప్రజ్ఞ గలవాడు' అన్నాడు. అని

ఒక్కసారి మైకేలుకేసి తిరిగాడు. మైకేలు తన చేతులోపని వది లేసి, దృష్టిగుచ్చి ఆ పిల్లలకేసి చూస్తున్నాడు. సిమోనుకి ఆశ్చర్యంవేసింది. పిల్లలైతే చక్కగానే ఉన్నారు. ఉండడం— నల్లటికళ్ళు, బొద్దుగా శరీరాలు, గులాబీరంగు బుగ్గలు, తమాషా మెడకట్లు, ఉన్నికోట్లు లాంటి వాటితో! కాని, లోగడే వాళ్ళని ఎరిగుంటే చూసినట్టు మైకేలు వాళ్ళనంత పరిశీలనగా ఎందుకు చూస్తూన్నాడా అనేదిమాత్రం సిమోనుకి అర్థంకాలేదు. అతనికి ఎటూ తోచక, ఆస్త్రీతో ఏమిటో మాట్లాడేసి, మజూరీ ఇంతాఅని చెప్పేసి, అది తీసుగోబోయాడు. ఆస్త్రీ కుంటిపిల్లని తన ఒళ్ళోకి తీసుగుని, 'ఈపిల్ల రెండుపాదాలకీ వేరువేరుగా ఆది పుచ్చుగో వాలి. ఈ కుంటిపాదానికి ఒక చెప్పూ సరియైన పాదానికి మూడు కుడితే చాలు. ఇద్దరి పాదాల ఆదీ సమానమే వీళ్ల కవలులు,' అంది. సిమోను ఆట్లాగేచేసి, కుంటిపిల్ల గురించి మాట్లాడుతూ 'ఈ పిల్లకి ఇదెట్లా సంభవించిందీ? ఇంత చక్కని అమ్మాయి! పుట్టుకలోనే ఇలా ఉందా?' అని కనుక్కున్నాడు. 'లేదు. ఈ పిల్ల తల్లి ఈ పాదాన్ని అణగ నొక్కింది.' అని అ స్త్రీ అంది. అప్పుడు మత్రేనాకి, ఈ స్త్రీ ఎవరూ, ఈ పిల్ల లెవరి పిల్లలూ అనే ఆశ్చర్యం కలిగి, తనూ అందుకుని, 'అయితే. వీళ్ల నీ పిల్లలుకారా?' అని అడిగింది. 'అమ్మా! నేను వీళ్ళకి తల్లినీకాను, ఏ చుట్టాన్నీ కుడా కాను. వీళ్ళు నాకు పూర్తిగా పరాయివాళ్ళే. అయితేం, వీళ్ళని నేను పెంచుగున్నాను' అని ఆ స్త్రీ చెప్పింది. 'నీ పిల్లలు కాకపోయినా వీళ్ళంటే నువ్వు ఇంత అభిమానంగా ఎట్లా ఉన్నావు?' అని

మత్రేనా అడిగింది. 'ఆప్యాయంగా ఉండక ఎందెయ్య గలను? ఇద్దరికీ నేనే పాలిచ్చాను. నాకు ఓ బిడ్డ ఉంటూండేది, ఆ బిడ్డని దేవుడు పుచ్చేసుకున్నాడు. ఆ బిడ్డమీద ఉండిన అపేక్ష కంటె వీళ్ళంటే ఇప్పుడు నాకు ఉన్న అపేక్షే ఎక్కువది.' అంది ఆమె. మత్రేనా 'మరి వీళ్ళెవరి పిల్లలూ?' అని ప్రశ్నించింది.

ix

ఆస్త్రీ మాట్టాడం మొదలెట్టి, కథ యావత్తూ చెప్పసాగ వచ్చింది:

'వీళ్ళ తల్లిదండ్రు లిద్దరూ గతించి సుమారు ఆరేళ్లైంది. వాళ్ళిద్దరూ ఒకేవారంలో పోయారు. ఒక మంగళవారం తండ్రిని మట్టిచేశారు, ఆ శుక్రవారమే తల్లి గతించింది. ఈ దిక్కులేని వాళ్ళు తండ్రి మరణించిన మూడురోజులకి పుట్టారు. వీళ్ళనికన్న తరవాత రోజేనా బతగలేదు తల్లి. నేనూ నా భర్తా ఆ గ్రామం లోనే రైతులం. వీళ్ళయింటి సరసనే మేం కాపరం. వీళ్లనాన్న ఒంటిగాడు, అడవిలో కట్టెలు కొట్టుగునేవాడు. చెట్లు నరకడంలో ఒకనాడు ఒక చెట్టు అతని మీద పడుతూంటే ఆపలేకపోయారు. అది అడ్డంగా అతనిమీద పడి అతణ్ణి అణిచేసేసరికి అతని పేగులు పైకొచ్చేశాయి. అతణ్ణి ఇంటికి చేర్చేలోపలే, అతని ఆత్మ దేవుడి దగ్గిరికి వెళ్ళింది. ఆ వారంలోనే అతడి భార్య కవలల్ని—వీళ్ళని—కంది. ఆమె దరిద్రురాలు, ఒంటరి. పిన్నగాని పెద్దగాని ఆమెకి సాయం ఎవ్వరూలేరు. ఒంటరిగానే వీళ్ళని కంది, ఒంటరిగానే మరణాన్ని ఎదుర్కొంది. మర్నాడు పొద్దుట నే నావిణ్ణి చూడ్డానికి వెళ్ళాను. నేను ఆ గుడిసెలోకి వెళ్ళేటప్ప

టికే, పాపం, ఆ దీసురాలు బిగిసిపోయి చల్లబడిపోయిఉంది. మరణసమయంలో ఆమె దొర్లి ఈ పిల్లపాదం అణగ నొక్కింది. అప్పుడు గ్రామవాసులంతా పోగై, శవాన్ని స్నానం చెయించి, పడుకోపెట్టి, పెట్టెచూసి, పాతిపెట్టారు. వాళ్ళు చాలా మంచి వాళ్ళు. కాని, ఈ పసివాళ్ళని వదిలేశారు. ఏమిటి వీళ్లని చెయ్యడం? అప్పట్లో చంటిబిడ్డ ఉంటూ నాకే. నా మొదటి కానుపు బిడ్డకి అప్పటికి రెండు నెలలు వెళ్ళి మూడోనెల. అందు కని అప్పటికి ఈ పిల్లల్ని నేను దగ్గిరికి తీశాను. రైతులంతా ఏకమై ఈ పిల్లన్ని ఎంజెయ్యడమా అని ఎంతేనా ఆలోచించారు. చిట్టచివరకి వాళ్ళు నాతో, 'మరియమ్మా! ప్రస్తుతం నువ్వే వీళ్ళని ఎల్లానోఅల్లా కనిపెట్టు. క్రమేపీ వీళ్ళని గురించి ఏర్పా టేదేనా చేస్తాం' అన్నారు. సరే అని నేను ఈ మంచిపిల్లకి పాలియ్యడం మొదలెట్టి, మొదట్లో ఈ రెండో పిల్లకి ఇయ్యడం మానేశాను. ఇల్లాంటి పాదంతో ఈ పిల్లబతుగుతుందనే నే నను కోలేదు. కాని, దిక్కులేని ఈ అమాయకపు అవిటిపిల్ల నామూ లంగా పాలులేకుండా బాధపడం ఏమిటని నాలో నేను అనుకో గానే నా మనస్సు కరిగిపోయి ఆ పిల్లకీ పాలియ్యడం ప్రారం భించాను. కన్నకొడుకునీ వీళ్ళనీ కుడా ఆరీతిగా నా రొమ్మిచ్చి నేను పోషించాను. అప్పుడు నాకు యవ్వనం, మంచి బలం, దండిగా తిండీ ఉండేవేమో, పాలేమిటి, ఒక్కొక్కప్పుడు చేపొచ్చి కాలవలు కట్టేసేవి. ఒక్కొక్కప్పుడు ఒక్కమాటుగానే ఇద్దర్ని కూచోపెట్టుగుని పాలిచ్చేదాన్ని, మూడో బిడ్డని అట్టేపెటి. తాగే వాళ్ళల్లో ఒకరికి కడుపు నిండిం తరవాత, మూడో వారికి

ఇస్తూండేదాన్ని. దేవుడి ఆజ్ఞ ప్రకారం వీళ్ళిద్దరూ బతిగి బట్ట కట్టారు, నా పిల్లాడు తన రెండోయేట మన్నైపోయాడు. నాకు మళ్ళీ కానుపులేదు, మా స్థితి బాగుపడితేం గనక! ఇప్పుడు నా భర్త మరలో ధాన్యపువర్తకుడి దగ్గిర, పనిచేస్తున్నాడు. ఆయనకి మంచి జీతం, మా పని బాగానే ఉంది. నాకు కన్నపిల్లలు లేరుగదా, ఈ చిన్ని అమ్మాయిలు లేకుండాపోతే, నేను ఎంత ఒంటరైపోయుందునూ? వీళ్ళని ప్రేమించకుండా ఎల్లా ఉండడం? నా జీవితానికి వీళ్ళే ఆనందం,' అని చెప్పి, ఆకుంటి పిల్లని తన హృదయానికి ఒకచేత్తో హత్తుగుంటూ రెండోచేత్తో ఆ పిల్ల బుగ్గలమీద కారే కన్నీళ్ళు తుడిచేసింది. మత్రేనా. పెద్ద నిట్టూర్పు పుచ్చి, 'సామెత చెబుతూంటారు, అది నిజమే. తండ్రి లేకపోయినా బతగవచ్చు, తల్లిలేకపోయినా బతగవచ్చుగాని, దేవుడు లేకుండా ఎవడూ బతగలేడు' అంది. అల్లా తలోమాటా చొప్పున వాళ్ళు మాట్లాడుకుంటూండగా, అథాత్తుగా గుడిసె యావత్తూ వెలిగిపోయింది. మైకేలు కూర్చున్న మూల ఉదయించిన వేసంగి మెరుపులాంటి తేజమే ఆ వెలుగుకి కారణం. అంతా అతనికేసి చూశారు. అతడు మోకాళ్ళమీద చేతులెట్టి కూచుని. పైకి చూస్తూ, చిరునవ్వు నవ్వుతున్నాడు.

×

ఆస్త్రీ పిల్లల్ని తీసుగుని వెళ్ళిపోయింది. మైకేలు బెంచిమీంచి లేచి, పరకరాలన్నీ పక్కని పెట్టేసి, తుకుపుగుడ్డ ఊడదీసి పడేసి. సిమోనుకి భార్యకీ వంగి నమస్కరించి, 'యజమానుల్లారా, సెలవు. దేవుడు నన్ను క్షమించాడు. ఓమక్షాపణ అర్థిస్తున్నాను,

నావల్ల వచ్చి ఉండగల ప్రమాదాలకి,' అన్నాడు. మైకేలు కాంతితో ప్రకాశిస్తూన్నట్టు వాళ్ళకి కనబడింది. సిమోను లేచి, మైకేలుకి వంగి నమస్కరిస్తూ, 'మైకేల్! నువ్వు సాధారణ మానవుడవు కావని నాకు తెలుస్తూన్నది. ఇక నిన్ను నేను ఆపా లేను, ప్రశ్నించాలేను. ఇంతమాత్రం నాకు చెప్పు; నేను మొదట నిన్నుచూసి మాయింటికి తీసుగువచ్చినప్పుడు ఉసూరుమని పోతూఉండే నీముఖం, నాభార్య నీకు ఆహారం తీసుకురాగానే చిరునవ్వుతో ప్రకాశించిందేం? తరవాత, ఆ ఘరానామనిషి బూట్సు చేసిపెట్టాలని నన్ను అడగడానికి వచ్చినప్పుడు, నీ ముఖం మరో చిరునవ్వుతో ఇంకా తేజోవంతం అయిందేం? మరి యిప్పుడు ఈ స్త్రీ ఆయిద్దరి అమ్మాయిలతోనూ రాగానే నీముఖం మూడోసారి చిరునవ్వు ప్రసరించి సూర్యప్రభలాంటి కాంతితో ఉందేం? చెప్పు, మైకేల్, చెప్పు. నీముఖం అల్లా మరీ మరీ వెలుగుచూపడం ఎందుకూ? నువ్వు మూడుసార్లు చిరు నవ్వు నవ్వడం ఎందుకూ?' అన్నాడు. అందుకు సమాధానంగా, మైకేలు, 'నాముఖం కాంతివంతం ఎందుకైందీ అంటే, శిక్షింప బడ్డ నన్ను దేవుడిప్పుడు క్షమించాడు. నేను మూడుసార్లు చిరు నవ్వు నవ్వడం ఎందుకనగా, దేవుడు నన్ను మూడు సత్యాలు నేర్చుగునే నిమిత్తం పంపించాడు, ఆ మూడు సత్యాలూ నేను నేర్చుగున్నాను. ఒక సత్యం, నీ భార్య నన్ను కనికరంతో చూసి నప్పుడు నేర్చుగున్నాను, గనక అప్పుడు మొదటి చిరునవ్వు నవ్వాను రెండో సత్యం ఆ ఘరానామనిషి బూట్సు కుట్టించు గోడానికి వచ్చినప్పుడు తెలుసుగున్నాను, గనక మళ్ళీ చిరునవ్వు

నవ్వాను. మరి యిప్పుడు ఆ పిల్లల్ని చూడడంతో మూడోసత్యం బోధపరుచుగున్నాను గనక, మూడోసారి చిరునవ్వు నవ్వాను' అన్నాడు. సిమోను, 'చెప్పు, మైకేల్! దేవుడు నిన్నెందుకు శిక్షించాడసలూ? ఆమూడు సత్యాలూ ఏమేమిటి? చెప్పు. నేను కుడా నేర్చుగోవచ్చును గనక' అన్నాడు. ఇందుకు బదులు చెబుతూ మైకేలు! 'ఆయనయెడల అవిధేయత చూపినందుకు దేవుడు నన్ను శిక్షించాడు. నేను స్వర్గంలో దేవదూతని. దేవుణ్ణి ప్రతివర్తించాను. ఒక స్త్రీయొక్క ఆత్మ తీసుగురమ్మని దేవుడు నాకాజ్ఞయిచ్చాడు. తక్షణం నేను భూమికి వాలి, అప్పుడే ఇద్దరి కవలల్నికని ఒంటరిగా పడిఉన్న సుస్త్రీయిల్లాల్ని చూశాను. శిశువులు నీరసంగా తల్లిపక్కనే కదుల్తూఉన్నా తల్లి వాళ్ళకి పాలిచ్చేటందుకు వాళ్ళని ఎత్తిపట్టుగోలేని స్థితిలోఉంది. నన్ను చూడగానే దేవుడు తన ఆత్మకోసం పంపించాడని ఆవిడ గ్రహించి, వెక్కివెక్కి ఏడుస్తూ, నాతో, 'దేవదూతా! నాభర్తని మొన్ననే పూడ్చారు. చెట్టు తనమీదపడగా అతడు మరణించాడు. నాకు ఏ సోదరీ, ఏ అత్తా, లేదు, తల్లీలేదు. నాపిల్లలకి దిక్కెవరూ లేరు నా ఆత్మ తీసిగెళ్ళకు! నా శిశువుల్ని పెంచి పాలియ్యనీ. నేనుద్ది మరణించేలోపల వాళ్ళబతుకు వాళ్ళు బతగడం నేర్చనీ. తండ్రీలేకుండా తల్లీలేకుండా పిల్లలు బతగలేరు' అంది. ఆమె మాటలు నేను వినిపించుగున్నాను. ఒకపిల్లని ఆవిడ రొమ్ముకి చేర్చి, మరోపిల్లని చేతికందించి, వెనక్కితిరిగి స్వర్గానికి దేవ సాన్నిధ్యానికి ఎగిరాను. ఎగిరి, 'నేను ఆతల్లి ఆత్మ లాగెయ్య లేకపోయాను, చెట్టుపడి ఆమె భర్త మరణించాడు. ఆమె శవ

లల్ని కంది. తన ఆత్మ తీసుగుపోవద్దని ప్రార్థించింది. "నా శిశువుల్ని పెంచి పాలియ్యనీ. నేను మరణించేలోపల వాళ్ళ బతుకు వాళ్ళు బతగడం నేర్చనీ. తండ్రిలేకుండా తల్లిలేకుండా పిల్లలు బతగలేరు" అని ఆమె వాపోయింది. అందుకని, ఆమె ఆత్మ నేను తీసుగురాలేదు' అని దేవుడితో విన్నవించుగున్నాను. అప్పుడు దేవుడు, 'వెళ్ళు. ఆ తల్లి ఆత్మతీసుగురా. మూడు సత్యాలు నేర్చుగో; మనుషిలో ఉండేది ఏమిటి? మనిషి చేతులోది కానిది ఏమిటి? దేనివల్ల మనుషులు బతగడం?—అనే ప్రశ్నలకి సమాధానాలు. ఈ సత్యాలు నేర్చుగోవడం అయిన తరవాత, స్వర్గానికి తిరిగి వస్తుగాని!' అన్నాడు. అందుకని, నేను మళ్ళీ భూమికివాలి ఆ తల్లి ఆత్మ తీసుగుపోయాను. పాలు తాగే శిశువులు కిందపడిపోయారు. ఆమె శరీరం పక్కమీద దొర్లుతూ, ఒక శిశువు పాదాన్ని అణిచినొక్కేసింది. నేను గ్రామంపైకి ఎగిరి, ఆతల్లి ఆత్మని దేవుడిదగ్గిర అర్పించాలని అనుకున్నాను. కాని, ఒక పెనుగాలిరేగి, నారెక్కల్ని ఊడ్చెయ్యగా అవి కిందరాలిపోయాయి. ఆతల్లి ఆత్మ ఒంటరిగా దేవుడుదగ్గిరికి ఎగిరింది, నేనేమో భూమిమీద ఒకరోడ్డు పక్కని కూలిపోయాను.' అన్నాడు.

## xi

తమతో ఉంటూన్నది ఎవరో తమ రెవరికి తిండీ బట్టా ఇచ్చారో, సిమోనుకీ మత్రేనాకీ బోధపడింది. వాళ్ళకి భయమూ భక్తీ ఆనందమూతోకూడిన ఏడుపు వచ్చింది. దేవదూత ఇంకా మాట్లాడుతూ, 'ఆ స్థలంలో నేను ఒంటరిగా దిగంబరిగా

ఉన్నాను. మానవుణ్ణి అయేవరకూ మానవుల అవసరాలుగాని, చలిగాని, ఆకలిగాని, నాకు తెలియలేదు. నేను కృశించి కర్రబారి ఏమిచెయ్యడానికీ ఎరక్కపోయాను. నేనున్నపొలానికి దగ్గిరిగా దేవుడికోసంకట్టిన గుడిఒకటి కనపడింది. ఆశ్రయం ఆశించి దాని దగ్గిరికి వెళ్ళాను. కాని గుడి తాళంపెట్టి ఉండడంచేత లోపల ప్రవేశించలేకపోయాను. అందుకని గాలిదెబ్బైనా తప్పించుగోవచ్చుగదా అని గుడివెనకాలకి చేరుకున్నాను. సాయంత్రం పడిపోతోంది, ఆకలై పోతోంది, బిగిసిపోతున్నాను, బాధలో ఉన్నాను. అథాత్తుగా రోడ్డువెంట ఒక మనిషిరావడం చూశాను. ఒక బూట్సుజోడు చేతపట్టుగుని, అతడు తనలో తను మాట్లాడుకుంటున్నాడు. నేను మనిషిని అయింతరవాత చూసిన మొదటి మర్త్యుని మొహం అదే! కాని ఆ మొహం నాకు చాలా భయంకరంగా కనపడడంవల్ల నేను నామొహం తిప్పేసుగున్నాను. శీతకాలంలో చలి తప్పించుగోడానికి శరీరాన్ని కమ్మడం ఎల్లాగా అనీ భార్యకీ బిడ్డలకీ తిండిపెట్టడం ఎల్లాగా అనీ తనలో తను మాట్లాడుకునే మనిషిమాటలు నా చెవిని పడ్డాయి. అప్పుడు నేననుకున్నానుగదా! 'చలితోటీ ఆకలితోటీ నేను చచ్చిపోతున్నాను. ఈ మనిషి ఆలోచించుగుంటూఉన్న విషయాలు భార్యకీ తనకీ చలికొట్టకుండా దుస్తు లెల్లాఅనీ, తమరందరూ తినడానికి రొట్టె ఎల్లాగనీనూ! ఈ మనిషి నాకు సాయంచెయ్యలేడు,' అని. ఆ మనిషి నాకేసిచూసి, చికాకుమొహంపెట్టి మరీ భయంకరంగా కనపడి దారినే నడుస్తూ నన్ను దాటిపోయాడు. నేను నిరాశలో పడ్డాను. కాని, అథాత్తుగా అతడు వెనక్కి వచ్చి

గాడు. నేను పైకి చూశాను. ఆ వచ్చినవాడు మొదటవచ్చినవాడు కాడు. మొదట వచ్చినవాడి మొహంలో నాకు మృత్యువు కనిపించింది. కాని ఇప్పుడు వచ్చిన మొహంలో నాకు జీవం కనిపించి, అక్కడ దేవుని అస్తిత్వం నాకు గుర్తువచ్చింది. వాడు నాదగ్గిరికివచ్చి, నాకు దుస్తులిచ్చి, లేవదీసి కూడానడిపించుగుని తనయింటికి తీసుగువెళ్ళాడు. నేను ఇంట్లో ప్రవేశించాను. ఒక స్త్రీ మా కెదురుగుండావచ్చి మాట్లాడ్డం మొదలెట్టింది. ఆ స్త్రీ ఆ మగవాడికంటె కుడా ఎక్కువ భయంకరంగా ఉంది. ఆమె నోట్లోంచి మృత్యుసారం వెలువడింది. ఆమె తనచుట్టూ వ్యాపింపజేసిన మృత్యు దుర్వాసన మూలంగా, నేను గాలి సరిగ్గా పీల్చుగోలేకపోయాను. చలిలోకి నన్ను గెంటెయ్యాలని ఆమె అనుకుంది. అల్లా ఆమె చేసిఉంటే ఆమె మరణించి ఉండేదని నాకు తెలుసుసు. కాని, అథాత్తుగా ఆమె భర్త ఆమెతో దేవుణ్ణి గురించి చెప్పాడు. తక్షణం ఆస్త్రీ మారింది. తరవాత, నాకామె ఆహారం తెచ్చిపెట్టి నాకేసి చూసినప్పుడు నేనామెకేసి ఇట్టే చూస్తునుగదా, ఆమె ముఖంలోంచి మృత్యువు వెళ్ళిపోయింది. అక్కడికి జీవం వచ్చిఉంది, ఆమెలోకుడా నేను దేవుణ్ణి చూశాను. అప్పుడు దేవుడు నన్ను నేర్చుగోమని నాకు విధించిన మొదటిపాఠం జ్ఞాపకం చేసుగున్నాను! 'మనిషిలో ఉండేది ఏమిటి?' అనేది. మనిషిలో ఉండేది ప్రేమే అని నాకప్పుడు తెలిసింది. దేవుడు నాకు చూపిస్తానని చేసిన వాగ్దానప్రకారం నాకప్పుడే చూపించడం మొదలెట్టాడుగదా అని సంతోషించి నేను మొదటిసారి చిరునవ్వు నవ్వాను. కాని, నేనింకా అంతా

నేర్చుగోలేదు. 'మనిషి చేతులోదికానిది ఏమిటి?' 'దేనివల్ల మనిషులు బతగడం?' అనేవి అప్పటి కింకా నేను తెలుసుగోవలిసి ఉన్నాయి.

మీతో ఒక సంవత్సరం గడిపాను. ఒకమనిషి బూట్సు కుట్టించుగోవాలని వచ్చాడు. అవి రూపం చెడకుండా కుట్లు పిగలకుండా సంవత్సరం మన్నా లంటాడు. నేను అతడికేసి చూశాను. కాని, అతడి భుజానికి వెనకవైపు, నాకు అధాత్తుగా నా స్నేహితుడు కనిపించాడు, ఆ స్నేహితుడు మృత్యుదూత, ఆ దూతని నేను తప్ప ఎవరూ చూడలేదు. ఆ దూతని నే నెరుగుదును, పైగా సూర్యుడు అస్తమించే లోపల ఆ దూత ఆ ఘరానా మనిషి ఆత్మ తీసుగుపోతాడని కుడా నే నెరుగుదును. అప్పుడు నాలో నేను, 'ఈ మనిషి సంవత్సరం మన్నడానికి సన్నాహాలు చేసుగుంటున్నాడే కాని, పాపం. సాయంత్రంలోపల చచ్చిపోగలడని యెరగడు,' అనుకున్నాను. ఆ మట్టున నాకు దేవుడు నియమించిన రెండోపాఠం, 'మనిషి చేతులోది కానిది ఏమిటి?' అనేది స్ఫురణకి తెచ్చుగున్నాను. మనిషిలో నివసించేది ఏముటో అదివరకే తెలుసుగుని ఉన్నాను. ఇప్పుడు మనిషి చేతులోది కానిది ఏముటో గ్రహించాను, మనిషియొక్క అవసరాలు తెలుసుగోడం మనిషి చేతులోది కానిది. అందుకని, రెండోసారి చిరునవ్వు నవ్వాను. నా స్నేహితుడైన ఒక దూతని చూసినందుకూ సంతోషించాను. దేవుడు నా యెదట రెండో సత్యాన్ని బహిర్గతం చేసినందుకూ ఆనందించాను.

కాని, అంతా నా కింకా తెలియలేదు. 'దేనివల్ల మనుషులు బతగడం?' అనేది నే నింకా ఎరగను, అందుకని మీతో ఉంటోచ్చాను, దేవుడు ఆ మూడో పాఠంకుడా నాకు విశదపరిచే వరకూ కనిపెట్టుగుని నేమ మీ యింట చేరిన ఆరోయేట ఆ స్త్రీతో కవల పిల్లలు వచ్చారు. వాళ్ళని నేను పోల్చుగుని, వాళ్లు సజీవులై ఎట్లా ఉండగలిగారో విన్నాను. ఆ గాథ అంతా విని, నాలో నేను, 'వీళ్ళ తల్లి నన్ను బతిమాలుకుంటూ వీళ్ళ రక్షణగురించే కదా! తండ్రీలేకుండా తల్లీలేకుండా పిల్లలు బతగలేరు, అని ఆవిడ అన్నమాటలు నేను నమ్మేశాను, కాని, ఒక పరాయి స్త్రీ వాళ్ళకి ఉపచారంచేసి వాళ్ళనిపెంచి పెద్దవాళ్ళని చేసింది గదా.' అనుకున్నాను. తరవాత. ఆ స్త్రీ తన గర్భవాసంకాని ఆ పిల్లల యెడల ప్రేమ కనపరుస్తూన్నప్పుడు, వాళ్ళని దగ్గిరికి తీసుగుని ఆనందబాష్పాలు రాలుస్తూన్నప్పుడు ఆవిడలో నేను సజీవుడైన దేవుణ్ణి చూశాను. 'దేనివల్ల మనుషులు బతగడం!' అనేది నాకు బోధపడింది, అక్కడితో దేవుడు నాకు ఆ ఆఖరి పాఠం కుడా వ్యక్తపరిచి, పాపినైన నన్ను క్షమించాడని నాకు తెలిసింది. అందుకని మూడోసారి చిరునవ్వు నవ్వాను.

## xii

ఆ దేవదూత శరీరం వస్త్ర విహీనమైనా గొప్ప కాంతితో ఆవరింప బడడంవల్ల కంటితో చూడ్డానికి శక్యంకాకుండా అయింది. అతని కంఠస్వరం, అతణ్ణించికాక స్వర్గాన్నించే వస్తూన్నట్టు హెచ్చైంది. ఆ దేవదూత ఇలా చెప్పాడు.' నేను నేర్చుగున్నది ఇది। దేనివల్ల మనుషులు బతగడం అంటే తమ

గురించిన జాగర్త తమరు పడడంవల్లకాదు, ప్రేమవల్లే—అని. తన పిల్లలు జీవించడానికి ఏమి అవసరమో తెలుసుగోడం ఆ తల్లికి చేతులోంచి కానిది. తన స్వంతానికి ఏమి అవసరమో తెలుసుగోడం ఆ ఘరానా మనిషికీ చేతులోదికానిదే, సాయంత్రం పడేటప్పటికి తన శరీరం నిమిత్తం బూట్సు అవసరమో లేక తన శవం నిమిత్తం స్లిప్పర్లు అవసరమో తెలుసుగోడంలో ఏ మానవుడికైనా చేతులోది కానిదే. నా మానవ రూపంలో నేను బతిగి ఉండ గలుగుతా నా గురించి నే పడ్డ జాగర్త మూలాన్ని కాదు, దారిని పోయేవాడిలో కనికరం నివసించి ఉంది గనక నున్నూ, ఆతని భార్య చూసి జాలిపడి కనికరించింది గనక నున్నూ, ఆ దిక్కులేని పిల్లలు బతిగి ఉండగలుగుతా వాళ్ళ తల్లి యొక్క తాపత్రయం మూలాన్నికాదు, పరాయివాళ్ళని చూసి, జాలిపడి వాళ్ళయందు ఆపేక్ష వహించిన ఒక స్త్రీ హృదయంలో ఉన్న ప్రేమ మూలంగా! తమ యోగక్షేమంగురించి ఆలోచన చేసుగోడంవల్లకాదు మనుషు లందరూ బతగడం! మనిషిలో ప్రేమ అనేది సజీవంగా ఉన్నది గనక, దేవుడు మనుషులకి జీవంఇచ్చి జీవించాలనే కోరికలుకుడా ఇస్తాడని నాకు లోగడే తెలుసు. కాని ఇప్పుడు నే నంతకంటె ఎక్కువ గ్రహించాను. మనుషులు ఒంటరిగా జీవించకూడదని దేవుడి అభిప్రాయం అని నాకు తెలుస్తోంది. కనకనే, ప్రతి ఒక్కడి అవసరాలూ ఏమేమిటో అందరి యెదటా బహిరంగపరచడు, కాని, అందరూ ఏకమై జీవించాలని దేవుడి అభిప్రాయం. కనకనే, అందరి యొక్క అవసరాలూ ఏమేమిటో ప్రతి ఒక్కడి యెదటా వ్యక్తం

చేస్తాడు, ఇప్పుడు నాకు బోధపడిన దాన్నిబట్టి!' మనుషులు తమ గురించి తమరుపడ్డ జాగ్రత్తవల్ల బతుకుతూన్నట్టు మనుషులకి కనిపించినా, వాళ్ళు బతుగుతూన్నది ప్రేమ మూలంగానే: ప్రేమ గలవాడు దేవుడిలో ఉంటాడు, దేవుడు వాడిలో ఉంటాడు ఏమనగా, దేవుడంటే ప్రేమ.' అని ముగించాడు.

తరవాత, ఆ దేవదూత, దేవుణ్ణి స్తుతిస్తూ గానంచేశాడు. అతని కంఠస్వరానికి గుడిసె జవజవ లాడింది. ఇంటికప్పు దారి యియ్యగా ఒక జ్వాలా స్తంభం భూమినించి ఆకాశందాకా లేచింది. సిమోనూ, అతని భార్యా, పిల్లలూ నేలమీద వాలిపో యారు. ఆ దేవదూత భుజాలకి రెక్కలు మొలిచాయి, అతడు అంతరిక్షానికి ఎగిరిపోయాడు.

సిమోను తనకి స్పృహవచ్చిం తరవాత చూడగా, గుడిసె యథాప్రకారంగానే ఉంది. తన భార్యా పిల్లలూ తప్ప మరొకరు లోపల లేరు.

---

## ఇద్దరు ముసిలివాళ్లు

(ఆమె ఆయనతో, 'అయ్యా. నువ్వు ప్రవక్తవని నాకు గోచరిస్తూ ఉంది. మా పూర్వులు దైవారాధన పర్వతాలలో చేసేవారు. యెరూషలేమే మనుషులు ఆరాధన చెయ్యవలిసిన స్థలం అని మీరు అంటున్నారు.' అంది. యేసు ఆమెతో, అమ్మా! నా మాట నమ్ము. ఆ తండ్రిని పర్వతాలల్లో గాని, యెరూషలేంలో గాని—ఎక్కడాకుడా ఆరాధించని ఘడియ వస్తుంది. కాని, యథార్థ ఆరాధకులు సార్థకంగానూ సత్యపరంగానూ ఆ తండ్రిని ఆరాధన చేసే ఘడియా వస్తుంది. వచ్చి ఇప్పుడుంటూంది. అటువంటి ఆరాధకుల్నే ఆ తండ్రి వెతుకుతూ ఉంటాడు'అన్నాడు—యోహాను iv 19-21,23.)

పూర్వం ఒకా నొకప్పుడు ఇద్దరు ముసిలివాళ్ళు దేవుణ్ణి ఆరాధించే నిమిత్తం యెరూషలేంయాత్ర వెళ్ళ నిశ్చయించుగున్నారు. వాళ్ళల్లో ఒకడు ఎఫీమో అనే రైతు. మంచి స్థితిపరుడు. రెండోవాడు ఎలీషా, ఇతనిది అంత మంచివసతికాదు. ఎఫీమో నిదానంగా గభీరంగా నిశ్చలంగా ఉండేవాడు. అతడెన్నడూ మద్యం పుచ్చుగోలేదు, పొగ తాగలేదు, పొడుం పీల్చలేదు, జీవితంలో తప్పుడుమాటలు ఆడలేదు. అతడు రెండు సార్లు గ్రామపెద్దగా ఉంటోచ్చాడు, రెండుసార్లూకుడా లెఖ్ఖ లేకుండా సొమ్ములుకుడా నికరంగానే ఉన్నాయి. అతనిది పెద్ద సంసారం—ఇద్దరు కొడుకులు, ఒక మనమడికి పెళ్ళికుడా అయింది, అయినా అంతా కలిసే ఉంటున్నారు. అతడు ఆరోగ్యంగా, పొడుగాటి గడ్డంతో, తలఎత్తుగుని ఉండేవాడు. అతనికి అరవైయేళ్ళు దాటినదాకా గడ్డం నెరవనేలేదు, తరవాత మట్టుకి ఒక్కరవ్వ బూడిదరంగుగా అది ఉంటోచ్చింది. ఎలీషా ధనికుడూ

కాడు పేదాకాడు. కొంతకాలం కిందట అతడు అన్యప్రాంతం వెళ్ళి వడ్రంగం చూస్తూండి, వయస్సు ముదిరింతరవాత ఇంటి పట్టునేఉండి ప్రస్తుతం తేనెటీగల్ని పెంచుతున్నాడు. అతని కొడుకుల్లో ఒకడు పనికోసం గ్రామాంతరం వెళ్ళాడు, రెండో వాడు ఇంట్లో ఉంటున్నాడు. ఎలీషా మెత్తటి మనస్సుగల కులాసామనిషి. అత డప్ప డప్పుడు తాగేమాట నిజమే, పొడుం కుడా పీల్చేవాడు. పాటంటే అతని కిష్టం. అతడు సరిపెట్టుగునే స్వభావం కలవాడుగనక ఇంట్లోనూ ఇరుగుపొరుగునా కుడా సఖ్యతగానే ఉన్నాడు. అతడు పొట్టిగా ఖగ్గిపోయి ఉంగరాల గడ్డంతో అతడి అభిమానఋషి అయిన ఎలీషాలాగే నున్నటి బట్టతలతో ఉన్నాడు.

ఇద్దరు ముసిలివాళ్ళూ చాలాకాలం క్రితమే యెరూషలేం యాత్రకి వెడతాం అని మొక్కుగోడంలో కలిసి వెళ్ళాలని ఏర్పాటు చేసుగున్నారు. కాని, ఎఫీమో తీరుబడి చేసుగోలేక పోయేవాడు. అతనికి ప్రతినిత్యమూ చేతినిండా ఎంతపనేనా ఉండేది. ఒకపని పూర్తికావడంతోటే మరోటి ప్రారంభం చేసేవాడు. మొదట మనమడి పెళ్ళి ఏర్పాట్లు, తరవాత సేనలోంచి తన చిన్నకొడుకు వస్తాడని కనిపెట్టుగుండడం, ఆ తరవాత కొత్తయిల్లు కట్టుగోడం.

ఒక తీరికరోజుని ముసిలివాళ్ళిద్దరూ ఇంటిబయట కలుసుగుని, అక్కడ ఏదో కలపఉంటే దానిమీద కూచుని మాట్లాడ్డం మొదలెట్టారు.

ఎలీ—అయితే, మన మొక్కు చెల్లించుగోడం ఎప్పు డంటావు?

ఎఫీ—(చికాకుమొహంతో) మనం ఇంకా ఆగితీరాలి. ఈ సంవత్సరం పొడుగునా నే పడ్డకష్టం ఇంతా అంతాకాదు. ఓ వంద పైచిలుకు అవుతుందిగదా అని ఈ కొత్తయిల్లు కట్టడం తల పెట్టాను. ఖర్చు ఇప్పటి కప్పుడే మూడువందలకి దేకుతోంది, ఇంకా అంతం కనపడదు. అందుకని వేసంగిదాకా మనం ఆగి పోవలిసుంటుంది. వేసంగిలో, దేవుడికి ఇచ్ఛకలిగితే, మనం తప్పకుండా వెడదాం.

ఎలీ—ఇది మనం బరగెయ్యకూడదనిన్నీ తక్షణం మనం వెళ్ళాలనిన్నీ నాకు అనిపిస్తోంది. వసంతకాలం ఉత్తమం.

ఎఫీ—దానికేం, ఆకాలం ఎంత సరియైన కాలమేనా అవును. కాని, నా యింటిమాట ? అది నే నెల్లా వదలగలనూ ?

ఎలీ—నువు దాన్ని వదిలేసి అప్పచెప్పడానికి ఎవరూ లేనట్టు మహా ! ఏముటోయ్, నీ కొడుకు దాని జాగర్త పడగలడు లేస్తూ !

ఎఫీ—కాని ఎట్లా ? మా పెద్దవాడు నమ్మతగ్గవాడు కాడు—వాడు ఒక గ్లాసు మరీ ఎక్కువ పుచ్చుగుంటూ ఉంటాడు.

ఎలీ—అయ్యో, నేస్తం ! మన అనంతరం మనంలేకుండానే వాళ్ళు వ్యవహరించాలిగదా, కొంచెంఅనుభవం ఆర్జించడంఇప్పుడే ఆరంభించనీ నీ కొడుకుని !

ఎఫీ—ఆమాటా నిజమే అనుకో ! కాని, ఎందుకో తెలియదు, పని ఆరంభం చేసినవాడికి ఆపని పూర్తి అయేటప్పుడు చూడాలని ఉంటుంది

ఎలీ—అయ్యో, నేస్తమూ ! మనం చెయ్యవలిసుండే పనుల మొత్తం గమనిస్తే వాటియొక్క అంతం మనం ఎన్నటికీ

చూడలేం. మొన్న ఈ మధ్య మా యింట్లో ఆడవాళ్ళు ఇంటి కడుగులూ బాగులూ మొదలెట్టారు, 'పునర్జన్మ' పండగ వస్తోంది గదా అని. ఇక్కడో కాస్తపనీ అక్కడో కాస్తపనీ మరోచోట కాస్తపనీ ఇల్లాగ్గా అవసరం అవడంవల్ల వాళ్లు ఆనాటికి చెయ్యవలసిన పన్నీ పూర్తిచెయ్యలేకపోయారు. ఆ సందర్భంలో మా పెద్దకోడలు, మంచి ప్రాజ్ఞురాలు గనక, ఏమందో విన్నావా? 'మనకోసం తను ఆగిపోకుండా పండగ మనమీద దానంతట అది వచ్చిపడుతుందిగనక మనం అందుకు కృతజ్ఞులం అయుండాలి. అట్లా జరక్కపోతే, మనం ఎంత శ్రమపడి పన్లుచేసినా అవి పూర్తిచేసుగుని పండగకోసం ఎదురు చూడడం అనేది పడనేపడదు,' అంది.

ఎఫీ—(ఆలోచనలో పడ్డట్టు కనిపిస్తూ) అది సరే. యీ యింటి మీద నేను బోలెడు పెట్టాను, ప్రయాణం అంటే ఖాళీ చేతులు ఝాడించుకుంటూ బయల్దేరలేం గదా. మనిషికి నూరు రూకలేనా ఉండాలి! అది కాస్తా కూస్తా మొత్తమా మరీ!

ఎలీ—(నవ్విపారేస్తూ) చాల్చాల్లే ఊరుకో ఈపాటి, ముసిలినేస్తం! నా ఆస్తికి పదిరెట్లు ఆస్తి పెట్టుగుని, సొమ్ముగురించి వెనకాముందూ చూస్తూన్నట్టు మాట్లాడుతున్నావేమిటీ? బయల్దేరడం ఎప్పుడో స్థిరచరుచు. ఇప్పుడు నాదగ్గిర దమ్మిడీయేనా లేకపోయినా ప్రయాణం వేళకి ఎంతకావాలో అంత ఉంటుంది.

ఎఫీ—(చిరునవ్వునవ్వుతూ) అమ్మ చిట్టీ! నువ్వింత ధనికుడవని నాకు తెలియదే! పోనీ, ఎక్కణ్ణించి తీస్తావు సొమ్మూ?

ఎలీ—ఇంట్లో కొంత సొమ్ము గోకి పోగుచేస్తాను. అది చాలకపోతే, పక్కింటివాళ్లకి పది తేనెపట్లు అమ్మేస్తాను, ఎన్నాళ్లనుంచో వాళ్ళు అవి కొనాలని చూస్తున్నారు.

ఎఫీ—నువ్వు అమ్మేసిన తరవాత, వాటిని ఈగలు ఎక్కువగా ముసిరితే నువ్వప్పుడు పశ్చాత్తాపపడవూ?

ఎలీ—అందుకు పశ్చాత్తాపమా? అవతలవాడి లాభం గురించా? నేనా? ఎన్నటికీ పశ్చాత్తాపపడను. నే చేసిన పాపాలకి తప్ప మరిదేనికీ నా జీవితంలో నేను పశ్చాత్తాపపడలేదు. అంతరాత్మకంటె అమూల్యమైనది మరిలేదు.

ఎఫీ—అవును, యధార్థమే. అయినప్పటికీ ఇంటి విషయాలు నిర్లక్ష్యం చెయ్యడం ధర్మంకాదు.

ఎలీ—కాని, అంతరాత్మల్ని నిర్లక్ష్యం చెయ్యడాన్ని ఏమంటావు? మనం శపథం చేశాం. అందుకని వెడదాం. విన్నావా? నువ్వలాటకి అనడంలేదు, మనం వెడదాం!'

ii

తన స్నేహితుణ్ణి ఒప్పించడంలో ఎలీషా కృతార్థుడయాడు. సంగతి పూర్తిగా ఆలోచించి ఉదయానికి ఎఫీమో ఎలీషాదగ్గిరికి వచ్చాడు. 'నువ్వు చెప్పింది ధర్మం. వెడదాం పద. బతుకూ చావూ దేవుడి చేతులోవి. బతికుండగానే తగ్గబలం ఉండగానే— ఇప్పుడే మనం వెళ్ళి తీరాలి' అని అతడన్నాడు.

వారం నాటికి ముసిలివాళ్ళిద్దరూ బయల్దేరడానికి సిద్ధంచేసుగున్నారు. ఏఫీమోకి కావలసిన డబ్బు చెతులోనే ఉంది. తను ఒక వందరూకలు పుచ్చుగుని పెళ్ళాం వాడుకోడానికి ఓ రెండు వందలిచ్చాడు. ఎలీషాకుడా ఆయత్తపడ్డాడు. తన పక్కింటివాడికి పది పట్లు అమ్మేసి, వేసంగిలోపల వాటిలోంచి రాగల కొత్తదండుల్నికుడా అతణ్ణి పుచ్చేసుగోమన్నాడు. వాటి మీద

అతడు దెబ్భై రూకలు పుచ్చుగున్నాడు. వందకి వచ్చేలోటు ఇంట్లో ప్రతీవాళ్ళదగ్గిరున్నదీ ఛీవాగా గోకేసి పూడ్చాడు. తన అంత్యక్రియల నిమిత్తం తను జాగర్త చేసుగున్నదంతా భార్య ఇచ్చేసింది, కోడలు దగ్గిరున్నదంతా కోడ లిచ్చేసింది. ఎఫీమో తన కొడుక్కి ప్రతీదాని గురించీ స్పష్టంగా ఆజ్ఞాపనలిచ్చాడు—ఎప్పుడు ఎంతగడ్డి కొయ్యాలో, పెంట ఎప్పుడు బళ్ళతో పొయ్యాలో, ఎట్లా యిల్లు పూర్తిచేసి పైకప్పు వెయ్యాలో! అతడు ప్రతీదీ ముందాలోచించి అనుగుణంగా ఉత్తరువు లిచ్చేశాడు. కాని, ఎలీషా దారే వేరు. అతడు తన పెళ్ళానికి విశద పరిచిందల్లా ఒక్కటే—తను అమ్మేసిన పది పట్లూ తమస్వంత ముసుళ్ళకి చాలా దూరంలో ఉండాలనీ, ఆ పదిపట్లూ పక్కింటి వాడు అనుభవించడం రూఢి అయేలాగు చూడాలనీ, ఆ విషయంలో మోసం ఏమీ జరగకూడదనీనీ! మరి ఇంటి విషయాల గురించి అతడు స్మరించనేలేదు. 'వచ్చే ఆవసరాలనిబట్టి, ఏమేమి చెయ్యాలో ఎట్లా చెయ్యాలో మీకే తెలుస్తుంది, యజమానులు మీరే గనక మీకు మిక్కిలి శ్రేయస్కరమైనది ఎట్లా సాధించాలో మీరు గ్రహించుగుంటారు' అనేశాడు. ఈరీతిగా అతడు సిద్ధం అయాడు. వాళ్ళవాళ్ళు భక్ష్యాలుచేసి పెట్టారు, సంచు లల్లి యిచ్చారు. కాలికట్లకి పీలికలు కోసి యిచ్చారు. యాత్రికు లిద్దరూ చర్మాల చెప్పులే తొడుక్కున్నారు గాని ముందవసరానికి మడత మట్టల చెప్పులు సంచీలో వేసుగున్నారు. గ్రామం చివరదాకా కుటుంబాల్లోవాళ్లు కలిసి కూడా వెళ్ళి, అక్కడవాళ్ళంతా సెలవు తీసుకోగా, ముసిలివాళ్ళిద్దరూ యాత్రకి బయల్దేరారు.

ఇంట్లోంచి వచ్చెయ్యగానేకుడా ఏలీషా మంచి హెచ్చరిక గానే ఉన్నాడు. మరి, గ్రామం దాటగానే అతడు ఇంటిసంగతులే మరిచిపోయాడు. అతని ప్రస్తుత తాపత్రయం ఏమిటంటే సాటి వాణ్ణి ఎల్లా తృప్తిపరచడమా, ఎవరైనా దుష్టమాట అనవలిసి రావడం తప్పించుగోడం ఎల్లాగా, సఖ్యతతోనూ కలిమిడిగానూ గమ్యస్థానానికి వెళ్ళివచ్చెయ్యడం ఎల్లాగా, అని! దారివెంట నడుస్తూండే సమయంలో, ఎదేనా ప్రార్థనేనా మెల్లిగా చేసుగునే వాడు, లేకపోతే తనకి జ్ఞాపకం వచ్చినంతవరకు ఋషుల జీవితాల వివరణాలు నెమరువేసుగునేవాడు. దారిలో ఎవరైనా తనకెదురై నప్పుడుగాని, రాత్రివేళ తనెక్కడేనా దిగినప్పుడుగాని వీలైనంత సాధుగా వర్తించడానికీ మంచిమాట ఆడడానికీ యత్నించేవాడు. ఎంతో ఆనందిస్తూ అతడు ప్రయాణంచేశాడు, ఒక్కటిమాత్రం అతడు మానలేకపోయాడు—పొడుంపీల్చడం. పొడుం డబ్బీ తనే యింటిదగ్గిర వేసివచ్చినా, దానికోసం చాలా దొర్లిపోయాడు. పాపం రోడ్డుమీద ఓమనిషి ఎదురై ఇంత పొడుం ప్రసాదించగా, చీటికీ మాటికీ తను వెనకాల దిగడాలనే దిగడుతూ (తన సోద రుణ్ణి ఆ వ్యామోహంలోకి ఎక్కడ ఈడ్చవలిసొస్తుందో అని) ఒక్కొక్క పట్టు పీల్చుగుంటూ ఉండేవాడు.

ఎఫీమో కుడా బాగా స్థైర్యంతో నడిచాడు. ఒక తప్పూ అతడు చెయ్యలేదు, ఒక పొల్లుమాటా ఆడలేదు. కాని, అతని హృదయానికి తేలాటంలేదు. ఇంటి తాపత్రయాలు అతని మనస్సుని దిగలాగేశాయి. ఇంటిదగ్గిర ఏమైపోతోందా గదా అనే, అతనికి నిరంతరమూ ఉంరూటన, 'అబ్బాయికి పప్లు పురమా

యించినప్పుడు నేను ఇది మరిచిపోలేదుగద అది మరిచిపోలేదు గద—' అనుకుంటూ, 'అవన్నీ వాడు తగ్గట్టు నిర్వహిస్తాడో ఏమో'—అనుకుంటూ అతడు ఇదయేవాడు. దారిపక్కని ఎక్కడేనా దుంపలు నాటుతూన్న మళ్ళుగాని పెంట తోలుతూన్న బళ్ళుగాని అతడు చూడడం తటస్థించినప్పుడు తన కొడుకుకుడా తను చెప్పినట్టు చేస్తున్నాడోలేదో తక్షణం తెలిస్తే బాగుండు ననుకునేవాడు. పన్లు ఎల్లా చెయ్యాలో వాడికి చూపించనేనా వచ్చు. లేక ఆమాటకొస్తే తనే అవి చేసిపారెయ్యచ్చు గనక వెనక్కితిరిగి ఇంటికి పోదామా అన్నంత ఆలోచనలో కుడా అతడు పడుతూండేవాడు.

iii

ముసిలివాళ్లిద్దరూ అయిదువారాలు నడుచుగుంటూ పోయే టప్పటికి తమరు స్వంతంగా తయారుచేనుగుని తెచ్చుగున్న మట్టలచెప్పులు అరిగిపోగా చిన్నరష్యా చేరుకున్న మొదలు కొత్తచెప్పులు కొనుక్కోడం మొదలెట్టారు. ఇల్లు వదిలిపెట్టిన లగాయతు వాళ్ళు తమ తిండికీ రాత్రిబసకీ సొమ్ము చెల్లకడుతూనే ఉన్నారు. కాని, చిన్నరష్యాలో వాళ్లు ప్రవేశించిన క్షణంనించీ జనం వీళ్ళని తమ ఇళ్ళకి ఆహ్వానించడంలో వంతులు పోవడం కుడా మొదలెట్టారు. ఆ జనం వీళ్ళని తమ ఇళ్ళల్లోకి తీసిగెళ్ళి భోజనంపెట్టి, ఏమిచ్చినా పుచ్చుగునేవారుకారు. పోనీ, పుచ్చుగోకపోడంసరి, పైగా వీళ్లు వెళ్ళిపోయే టప్పుడు దార్లో తిన డానికి రొట్టెలూ ఒక్కొక్కప్పుడు భక్ష్యాలుకుడా వీళ్ళ సంచుల్లో పడేసేవారు.

ఇలాగ్గా సుమారు అయిదువందలమైళ్లు కాసీఖర్చులేకుండా ముసిలివాళ్లు ప్రయాణంచేశారు. వాళ్ళప్పటికి జేరుకున్న రాష్ట్రానికి తరవాతిది దాటి ఒక జిల్లా ప్రవేశించారు. అక్కడ పంటలు పోయినాయి. అయినాసరే రైతులు వీళ్ళకి రాత్రిబస ఊరికేనే ఇచ్చేవారుకాని, తిండిమాత్రం ఊరికే పెట్టలేకపోయారు. ఒక్కొక్కప్పుడు వీళ్ళిద్దరికి సయితం తిండి దొరికేదేకాదు. ఎంత కావలిస్తే అంతా చెల్లిస్తాం అని వీళ్ళనేవారు. అంటేం? రొట్టె అనేది లేందే! ఆ క్రితం సంవత్సరంకుడా పంటలు పోయినట్టు జనం చెప్పారు. ఖామందులైనవాళ్ళు చితిగిపోయి ఆస్తులన్నీ అయినకాడికి అమ్మేసుగున్నారు. ఓమోస్తరు రాబడి ఉండేవాళ్లు ఏమీలేకుండా అయారు. సరి, దరిద్రుల్లో కొందరు ఆ ప్రాంతం నించి లేచిపోయారు, తక్కినవాళ్లు ఘటం ఈడ్చుగుంటూముష్టైనా ఎత్తుగుంటున్నారు, లేకపోతే దారుణమైన ఆకటి చిచ్చుతో గుడిసెల్లో మాడేనా పోతున్నారు. ఆ గడిచిన శీతకాలంలో ఆ దరిద్రులు ఊకపొట్టూ కూరాకులూ తిని గడుపుగున్నారుట.

ఒకరాత్రి, ముసిలివాళ్లు ఒకగ్రామంలో ఆగారు, పదిహేను పౌన్ల రొట్టె కొనుక్కున్నారు, అక్కడ పడుకున్నారు, ఎండ దెబ్బ తినకుండా చాలామేర వెళ్ళడానికి వీలనిచెప్పి సూర్యోదయానికి పూర్వమే బయల్దేరారు. ఎనిమిదిమైళ్లు వెళ్ళి, ఒక వాగు కనిపిస్తే ఆగి, చిప్పనిండా నీళ్ళోసి కొంతరొట్టె అందులో నానేసి తిన్నారు. కాళ్ళచుట్లు పిరాయించి, కాస్త విశ్రమించారు. ఎలీషా తన పొడుంతీశాడు. ఎఫీమో తన తల ఇటూ అటూ కదుపుతూ, 'ఈ దిక్కుమాలి దురభ్యాసం మానుకోవాలని

చూడవేం ?' అన్నాడు. ఎలీషా తనచెయ్యి ఊపుతూ 'ఈ దుర భ్యాసమే ఎక్కువ బలాసి నాకంటె,' అన్నాడు.

తక్షణం వాళ్ళులేచి బయల్దేరారు. మరో ఎనిమిదిమైళ్ళు గడిచి ఓ పెద్దగ్రామం చేరి తిన్నగా దానిగుండా నడుచుకుపోయారు. ఎండ, తీవ్రం అయింది. ఎలీషా వేళ్ళాడిపోయాడు. కొంచెం విశ్రమించి కాసిని మంచినీళ్ళు తాగాలని అతనికోరిక. కాని ఎఫీమో ఆగలేదు. అసలు ఇద్దరిలోనూ ఎఫీమోయే ఎక్కువ నడవగలమనిషి. అతడి సరసనే తనూ నడవాలంటే కుదరక ఎలీషా నానాతంటాలూ పడవలిసొచ్చేది. 'కాసిని నీళ్లు దొరికి తేనా ?' అన్నాడు ఎలీషా. ఎఫీమో 'ఓ. నిక్షేపంలా తాగు. నా కక్కర్లేదు,' అనేశాడు. ఎలీషా ఒక్కరవ్వ నిదానించి, 'పోనీ, నువ్వు నడుస్తూండు. ఇదుగో ఈ పక్క చిన్నటి గుడిసెకి పరి గెడతాను. క్షణంలోవచ్చి పట్టుగుంటాను నిన్ను' అన్నాడు. ఎఫీమో 'ఓ. మాభాగే,' అని చెప్పేసి, పెద్ద రస్తామీద తనొక్కడూ నడుచుగుంటూ వెళ్ళాడు, ఎలీషా వెనక్కి తిరిగి ఆ గుడిసెదగ్గిరికి వెళ్ళాడు.

అది చిన్నగుడిసె, బంకమట్టి గిలాబాగోడలు. కింద నల్ల వాకుగా ఉంది, పైన వెల్లేశారు. కాని మట్టి రాలిపోయింది. ఆ గోడలు భాగుచెసి ఎంతకాలం అయిందో అని విశదం అయి పోతోంది. ఓ పెడ ఇంటి కప్పులోంచి రెల్లు లేచిపోయింది. ఇంట్లోకి ప్రవేశం దొడ్లోంచి, ఎలీషా దొడ్డి ప్రవేశించాడు. ఇంటి చుట్టూ ఉన్న మట్టికోరడు పక్కనే ఒక మనిషి శల్యా వశిష్టంగా పడిఉన్నాడు. అతనికి గడ్డంలేదు, షర్టు చివళ్ళ

లాగులో జొనిపే ఉన్నాయి. అక్కడి అలవాటు చొప్పున, మొదట బహుశా నీడనే పడుకుని ఉంటాడు గాని, సూర్యుడితో నీడ కదలడంవల్ల, ఇప్పు డతని మొహం మీద బాగా ఎండ పడుతోంది. నిద్దరపోతూండకపోయినా, అత డక్కడ పడే ఉన్నాడు. మంచినీళ్ళు కావాలని ఎలీషా అతణ్ణి అడిగి చూశాడు గాని ఆ మనిషి ఏమీ సమాధానం ఇయ్యలేదు. 'జబ్బో లేక మనిషే అల్లాంటి వాడో' అనుకున్నాడు ఎలీషా. అతడు ద్వారం దగ్గిరికి వెళ్లగా లోపల్నుంచి బిడ్డఏడుపు వినపడింది. తలుపు చెయిపట్టుగా ఓ ఇనపచుట్టు ఉంటే, దాంతో తలుపు కొట్టాడు.

'ఎవరండీ, యజమానులు?' అని అరిచాడు. సమాధానం లేదు. తన కర్రతో మళ్ళీ కొట్టాడు. 'ఏమండోయ్, క్రైస్తవులు!, అని కేకపెట్టాడు. ఎక్కడా శబ్దంలేదు. ఎవరయ్యా, దైవ భక్తులు?' అని ఇంకా బిగ్గిరిగా అన్నాడు. అయినప్పటికీ సమాధానం రాలేదు. వెనక్కి తిరిగి తన దారిని పోదామని ఎలీషా అనుకున్నాడు. కాని, తలుపు అవతల్నుంచి ఒక మూలుగు తను వింటూన్నట్టు అయింది, 'నేను ఇదైపోనూ! ఈ యింటి వాళ్ళకి ఏ మహాకష్టమేనా సంభవించిందా ఏమిటి చెప్మా! పోనీ ఒక్కమాటు చూడడమే నయం' అనుకున్నాడు. అనుకుని, ఎలీషా ఆ యింట్లో ప్రవేశించాడు.

## iv

ఎలీషా తలుపుమధ్య ఉన్న ఇనపచుట్టు తిప్పి చూస్తే తిరిగింది. తలుపు తాళంవేసే లేదు. అతడు తలుపు తెరిచి సన్నటి నడవ వెంట వెళ్ళాడు. ఉమ్మడి గది తలుపు తీసే ఉంది.

ఎడమపక్క ఇటకమిద్దె ఉంది. ఎదురుగుండా గోడకి ఆనుకునే ఉన్న విగ్రహాలఅలమారాఎదట వేసిన బల్ల పక్క బెంచీమీద ఒక ముసలమ్మ కూర్చుంది. ఆమె ఒకే దుస్తు కప్పుగుని తలకి ఏమీలేకుండానే, బల్లమీద మోపెట్టి కూర్చుంది. పక్కని ఒక పల్చటి కుర్రాడు మైనపురంగు ఒంటితో పెద్దపొట్టవేసుగుని ఉన్నాడు. వాడు ముసలమ్మని ఏదో అడుగుతూ, చేతిచివరి కొంగుపట్టుగుని లాగుతూ, గోలెట్టి ఏడుస్తున్నాడు. ఎలీషా లో పలికి వెళ్ళాడు. లోపల వాసన ముక్కు బద్దలై పోతోంది. అతడు నలుముఖాలా చూశాడు. మిద్దెపక్క ఒక స్త్రీ పడిపోయి ఉంది. మూతలు పడ్డ కళ్ళతో, గురగురలాడే కంఠంతో, ఆవిడ నేలమీద సాగారిపోయి, ఒకొక్కసారి ఓ కాలు చాపుగుంటూ మరో అప్పుడు అ కాలు దగ్గిరికి ఈడ్చుగుంటూ ఈపక్కకీ ఆ పక్కకీ గిజగిజా కొట్టుగుంటూ ఉంది. దుర్గంధం ఆవిడ దగ్గిర్నుంచే వస్తూంటూ. ఆవిడ తను తన కేమీ చేసుగోలేదనీ, ఆవిడికిఉపచారం చేసి పెట్టేటందుకు మరెవరూ లేరనీ తెలిసేపోతోంది. ముసలమ్మ తలయెత్తి పరాయిమనిషిని చూసి, 'ఏం కావాలి? నీకేం కావాలి, అబ్బీ! మా దగ్గిర ఏమీలేదు,' అంది. ఆవిడ తన మాండలిక భాషలో ప్రసంగించినా ఎలీషా అర్థం చేసుగున్నాడు, 'మంచి నీళ్ళకోసం వచ్చాను, భక్తురాలా!' అన్నాడు. 'ఎవరూలేరు— ఒక్కరూ కుడా—దేంట్లోపోసి తేవడం? ఏమీలేదు తెచ్చేటం దుకు. నీదార్ని సువ్వెళ్ళు' అని ముసలమ్మ చెప్పింది. 'అలా అయితే, ఆ నేలమీది స్త్రీకి ఉపచారం చెయ్యగలిగినంత ఆరో గ్యంలో మీలో ఏ ఒకరూ కూడా లేరా?' అని ఎలీషా రసుక్కు

న్నాడు. 'లేరు. ఏ ఒక్ఖరూలేరు. నా కొడుకు అదుగో ఆ బయట మరణిస్తున్నాడు, మేం లోపల మరణిస్తున్నాం' అని బదులు చెప్పింది. పరాయిమనిషిని చూడగానే ఆ కుర్రాడు ఏడుపుమానే శాడు, కాని ముసలమ్మ మాట్లాడ్డం ప్రారంభించగానే మళ్ళీ ఆవిడ దుస్తుయొక్క చేతిచివరపట్టుగుని లాగుతూ, 'రొట్టి, నానమ్మా, రొట్టి:' అని ఏడుస్తూ అడిగాడు. ముసలమ్మ నేదో అడిగి కనుక్కోవాలని ఎలీషా అనుకుంటూన్నసమయంలో, బయటిమనిషి తూలుకుంటూ యింట్లోకి వచ్చాడు. నడవవెంట గోడని అంటిపెట్టుగుని రాగలిగాడు గాని, ఉమ్మడి గదిలో ప్రవే శించడానికి యత్నించగానే గుమ్మం దగ్గిరే ఒకమూలకి చాప చుట్టలాగ పడిపోయాడు. అతడు లేచివెళ్లి బెంచీమీద కూర్చో డానికేనా మళ్ళీ యత్నపడకుండానే ఒక్కొక్కమాట చొప్పున పలకడం ప్రారంభించాడు. ఒక మాటలోపల్నించి తెచ్చి బయట వేస్తూండడం, ఆగిపోతూండడం, బోలెడు గాలి లాగుతూండడం, రొజుతూండడం. 'రోగం—మమ్మల్ని వదలకుండా పట్టుగుంచి. కరువు—అయ్యో—చచ్చిపోతున్నాడు—ఆకల్తో' అంటూ ఆమనిషి కుర్రాణ్ణి చూపిస్తూ' వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టాడు.

ఎలీషా తన సంచీమాట ఎదరకి వచ్చేటట్టు నెట్టి తను తన భుజాలకి వేసుగున్న సంచీతాళ్ళు విడిపించుగుని, సంచీ నేల మీద దింపుగున్నాడు. తరవాత అతడు దాన్ని బెంచిమీదికి ఎత్తి, దాని తాడుముళ్లు విప్పేసి, దాని మూతి వదులుచేసి, అందు లోంచి పెద్ద రొట్టెతీసి, తన చాకుతో అందులోంచి ఒక్కముక్క కోసి, ఆ మనిషికి ఇయ్యబోయాడు. ఆ మనిషి తను అది పుచ్చు

గోక, ఆ చిన్న కుర్రాడికేసీ మిద్దె వెనకాల బోర్లపడి ఉన్న ఒక కుర్రదానికేసీ, 'వాళ్ళిద్దరికీ పెట్టుబాబూ' అన్నట్టు చూపించాడు. ఎలీషా ఆ రొట్టెముక్క కుర్రాడి చేతులో పెట్టబోయూడు. ఆ కుర్రాడు రొట్టె వాసన తగలగానే, తన చిన్ని బాహువులు చాచి, తన చిట్టి చేతులు రెండింటితోనూ దాన్ని దొరకపుచ్చేసుగుని, కొరికేశాడు—ఆ కొరకడంలో అతడి ముక్కుగుడా ఆ రొట్టెలో కూరుకు పోయేటట్టు. ఆ చిన్నిపిల్ల మిద్దెవెనకాల్నుంచి వచ్చి రొట్టిమీదే రెండు కళ్ళూ పెట్టుగుని నుంచుంది. మరోముక్క ఆ అమ్మాయికీ ఇచ్చాడు ఎలీషా. అతడు ఇంకో ముక్క కోసి ముసలమ్మ కియ్యగా, ముసలమ్మ తన చిగుళ్ళతో ఆ రొట్టిని రుబ్బడం మొదలెట్టింది. 'కాసిని నీళ్ళు తీసుగురాగలిగితేనా! పాపం వీళ్ళ నోళ్ళు అర్చుగుపోయాయి. నీళ్ల తేవడానికి నేను ప్రయత్నించాను నిన్న—నిన్నో ఈ వేళో నాకు గుష్టులేదు—గాని, కింద పడిపోయానే గాని ఒక్క అడుగు ముందుకి వెళ్ళలేక పోయాను, బాల్చీ పడిపోయి అక్కడే ఉండాలి, ఎవదేనా పట్టుగుపోకుండా ఉంటే' అని ముసలమ్మ చెప్పగలిగింది. ఎలీషా ఆ నుయ్యి ఎక్కడో ముసలమ్మవల్ల తెలుసుగుని, బయటికివెళ్ళి, బాల్చీ అక్కడే పడిఉండగా అది తీసుగుని, దాంతో కొన్ని నీళ్ళు తెచ్చి, వాళ్ళు తాగడానికి ఇచ్చాడు. ఆ పిల్లలూ ముసలమ్మా దాహం తీరింతరవాత మరి కొంచెం రొట్టె తిన్నారుగాని. ఆ మనిషి మాత్రం ఏమీ తిన్నాడు కాదు, 'తినడానికి నాకు నోరెల్లావస్తుందీ?' అన్నాడు. ఇంతసేపు జరిగినా. ఆ పడుచావిడ ఒక వైపునించి మరోవైపు దొర్లు

తూనే ఉందిగాని. స్పృహలోపడ్డ ధోరణి కనిపించనేలేదు. తక్షణం ఎలీషా ఊరిదుకాణం దగ్గిరికి వెళ్ళి సజ్జలూ, ఉప్పూ. పిండీ, నూనీ పట్టుగొచ్చి, గొడ్డలి కనపడితే అదుచ్చుగువి పేళ్ళు కొట్టి, నిప్పుచేసి, ఆ చిన్నపిల్ల తనకిసాయితాపడగా, ఏదోయింత పులుసుకాచి, ఆ మాడిపోతూన్న జనానికి భోజనంపెట్టాడు.

V

ఆ మనిషి కొంచెం తిన్నాడు. ఆ ముసిలావిడ కుడా కొంచెం తింది, ఆ పిల్లా ఆ పిల్లాడూ చిప్పలుకుడా సుబ్బరంగా నాకి పారేసి ఒకరిచేతుల్లో ఒకరు కట్టకట్టుగునిగాఢంగా నిద్రపోయారు. ఆ మనిషీ ఆ ముసలమ్మా కుడా ఎలీషాతో చెప్పడం మొదలెట్టారు, తమరు తమ ప్రస్తుత దుస్థితిలోకి ఎల్లా వచ్చారో. వాళ్ళు అన్నారు: మేం అసలు దరిద్రులం. పంటలు కుడా పోయాయి. మేం నేకరించుగున్న దాన్తో ఎల్లాగో చచ్చిచెడి శీతకాలం దాకా గడిపాం. శీతకాల నిమిత్తం మేం ఏమీ కుడా సెట్టుగో లేకపోయి, ఇరుగు పొరుగుల్నే కాక, ఎవరు మాకు వీలైతే వార్నల్లా అర్థించవలిసిన వాళ్ళం అయాము, మొదట్లో మేం అడిగినవి ఇచ్చేవారు. తరవాత నించి లేదు పొమ్మంటో చ్చారు. మాకియ్యాలని మనసారా సంతోష పడేవాళ్ళ దగ్గిర ఇయ్యడానికి ఏమీ ఉండేదేకాదు. మరి అడగడం మాకు సిగ్గు వేసింది. ఎటు చూసినా మాకు బాకీలే—సొమ్మో, పిండో, రొట్టో. ఏదోవోటి.'

ఆ మనిషి, 'పని దొరుకుతుం దేమో అని నేను వెళ్ళాను. కాని ఎక్కడా పనేలేమ. తిండి పారేస్తే పని చేస్తాం అనేవాళ్ళు

ప్రతీచోటా ఉంటోచ్చారు. ఒకరోజు ఏ తప్పిజారో చీమంతపని దొరికేది, తరవాత పనికోసం రెండు రోజులు తిరగాలన్నమాటే. అప్పట్లో ముసిలమ్మా పిల్లా కలిసి, కాస్త దూరంగా వెళ్ళి, ముష్టెత్తేవారు. దానివల్ల ఆట్టే వచ్చేదికాదు, రొట్టె అంత అబ్బరం అయిపోయింది, కాని. ఎల్లానో తిండికిమాత్రం ఇక్కడో కొంతా అక్కడోకొంతా గోకి పోగుచేసుగుని గడుపుదాం అనుకుంటూంటే, వసంతం వచ్చేసరికి జనం పెట్టడం అసలే మానేశారు. పైగా, రోగం మమ్మల్ని ఆవహించింది. పరిస్థితి అంతకంటె అంతకంటె పాడైపోయింది. ఒకనాడు కాస్తకాస్త తినడం, తరవాత రెండు రోజులపాటు లంకణాలు, గడ్డి తినడం మొదలెట్టాం. అదే అనుకుంటాను నా భార్య వ్యాధికి కారణం, కాక మరోటో. నాకు తెలియదు. ఆమె క్రమేపీ నుంచోడానికి కాళ్ళ సత్తువ లేకుండా అయింది, నేను బొత్తిగా బలహీనుణ్ణయిపోయాను, కోలుకుందామంటే ఏ సాయమూ కనపడదు' అన్నాడు, ఆ ముసలమ్మ, 'కొంత కాలంపాటు నేను ఒంటరిగా తంటాలుపడ్డాను, కాని చివరికి నేనూ, తిండిలేక, చాలా నీరసించి, పడిపోయాను. ఈ పిల్ల చూడొస్తే, నీరసంగా, పిరికిగా తయారైంది. పొరుగింటికి వెళ్ళిరావే అన్నాను, అంటేం. బయట కాలెట్టక, ఆ మూలకి పాకి అక్కడ కూచుంది. మొన్న ఒకావిడ మమ్మల్ని చూడడానికి ఇంట్లో కొచ్చింది, కాని, రోగమూ ఆకలీ కుడా మమ్మల్నే ఆశ్రయించి ఉండడంవల్ల ఆవిడ వెనక్కిపోయి, మమ్మల్ని వదుల్చుగుంది. ఆవిడ ముగుడు ఎక్కడికో వెళ్ళవలిసి ఉందిట, తన బిడ్డలకే అసలు

ఏమీ లేదుట, తినడానికి. అందుకని, మేం అంతా మరణాని కోసం ఎదురుచూస్తూ ఉన్నాం.' అంది.

వాళ్ళగాథ యావత్తూ విని, తను తన స్నేహితుడైన ఎఫీమోని వెళ్ళి ఆరోజే అందుకోవాలనే ఆలోచన మానేసుకుని, ఆ రాత్రంతా వాళ్ళతోనే ఉండిపోయాడు. పొద్దున్న లేస్తూనే అతడు ఇంటిపని చెయ్యడం మొదలెట్టాడు—అది తన స్వంత యిల్లయినట్టు. ముసలమ్మ సాయంతో అతడు పిండిపాకం చేసి, నిప్పు చేశాడు. మరీ అవసరమైనవి తేవడానికి అతడు పిల్లని కూడా తీసుగుని పొరుగిళ్ళకి వెళ్ళాడు. ఏమంటే, కొంపలో ఏమీ లేదు. వంటసామాన్లు: బట్టలు సమస్తమూ కుడా తిండి కొనుక్కోడానికి తెగనమ్మి పారేశారు. అందుకని, కొన్ని తనే తయారుచేసి కొన్ని కొని, ఏమేమి కావాలో అవన్నీ అయింట్లో మళ్ళీ మూర్తీభవించేలాగ చూశాడు ఎలీషా. ఒకరోజున్నాడు, మర్నాడున్నాడు, మూడోనాడు కుడా ఉన్నాడు. కుర్రాడికి కాస్త సత్తువ చేరుకుంది, ఎలీషా కూచున్నప్పు డల్లా, కుర్రాడు బెంచి మీద నిమ్మళంగా పాక్కుంటూ వెళ్ళి, అతని ఒడిలో దూరే వాడు. కుర్రపిల్ల మొహానికి కొంచెం కళ వచ్చింది. ఆ పిల్ల ఎలీషాకి పన్లో సాయపడుతూ, అతని వెనకాలే పరిగెడుతూ, అతన్ని 'నాన్నా, నాన్నా' అని పిలుస్తూ, ఉండడం మొదలెట్టింది. ముసలమ్మకి కుడా కొంచెం బలం చేరుకుంది. ఒక పొరుగావిణ్ణి చూడడానికి ఆవిడ నడిచే వెళ్ళగలిగింది. ఆ మనిషి కుడా నయమే. గోడ పట్టుగుని ఇటూ అటూ తిరగడం మొదలెట్టాడు. అతని భార్య మాత్రం లేచి నుంచోడం జరగలేదు.

కాని, ఆమెకి కుడా మూడోనాడు స్పృహవచ్చి, ఆహారం అడిగింది. ఎలీషా, 'ఔరా! దార్లో ఇంతకాలం ఇట్లా పాడౌతుందని నే నెన్నడూ అనుకోలేదు. ఇక నేను నడుస్తూండడంలో పడి తీరాలి.' అనుకున్నాడు.

vi

ఆ నాలుగో రోజు సరిగ్గా వేసంగి ఉపవాసకాలం తరవాత పండగ రోజైంది, అందుకని, ఎలీషా, 'పోనీ నేనుకుడా వీళ్ళతో కలిసే చేస్తాను పారణ, వెళ్ళి ఏదో కొనుక్కొస్తాను, కలిసి పండగ భోజనం చేసేస్తాం, సాయంత్రం తప్పకుండా బయల్దేరతాను' అనుకున్నాడు. తక్షణం అతడు ఊళ్ళోకివెళ్ళి పాలూ గోధుమ పిండీ వంటకొవ్వూ కొనితెచ్చి ముసలమ్మ ఆసరాతో మర్నాటి నిమిత్తం ఉడికేవీ వెయించేవీ తయారుచేశాడు. పండగనాడు ఎలీషా చర్చికి వెళ్ళివచ్చి, ఆ యింట్లో స్నేహితు లందరితోటీ ఉపవాసాంతం చేశాడు. ఆ రోజున ఆ భార్యకుడా లేచి ఇటూ అటూ కాస్తంత అడుగులు వెయ్య గలిగింది. భర్త క్షౌరం చేసుగుని, ముసలమ్మ ఉతికిపెట్టి ఉంచిన షర్టు తొడుక్కున్నాడు, సుబ్బరమైంది. ఊళ్ళో ఒక ధనికుడైన రైతుకి ఇతని సాగు నేలా పచ్చికబీడూ కుడా తణఖా. పంటల అనంతరందాకా ఆ పొలమూ ఆ బీడూ తన స్వాధీనంలోనే ఉండడానికి కనికరించి అనుమతి ఇయ్యవయ్యా అని ప్రార్థించడానికి అతడు వెళ్ళాడు. కాని, సాయింత్రానికి ఇంటికొచ్చి రాగాలు పెడుతూ కూచున్నాడు. ఏమంటే, డబ్బుగల ఆ రైతు ఎంతమాత్రం కనికరించక షొమ్మక్కడ పెట్టాలన్నాడు. ఎలీషా మళ్ళీ ఆలోచ

నలో పడ్డాడు. అతడు తనలో, 'వీళ్ళెల్లా బతగడం? కడంవాళ్ళు గడ్డి ఎండేసుగుంటారు, కాని వీళ్ళసలు గడ్డెల్లా కోస్తారూ బీడే తణఖాలో ఉన్నప్పుడూ? రాగులు పండుతాయి, అందులో ఈ యేడు పొలాలు చితగ పండేశాయి, భూమాత దయవల్ల. తక్కిన వాళ్ళంతా కోతలు పడతారు, కాని వీళ్ళకేం ఉందీ ఆశపెట్టుగోడానికీ? వీళ్ళకున్న మూడెకరాల సాగుభూమీ ఆ మోతుపరిరైతుకి తాకట్టుగా! నేనూ అటు వెళ్ళడంతోటే, నేను మొదట చూసినప్పుడు వీళ్ళేస్థితిలో ఉన్నారో ఆ స్థితిలోకే కొట్టుగెళ్ళి పడతారు,' అనుకున్నాడు. అతని కిప్పుడు రెండిందాల వచ్చింది. కాని చివరకి ఎల్లాగో ఆవేళకి ప్రయాణం మానేసి, మర్నాటిదాకా ఉందాం అనుకున్నాడు. నిద్రపోవాలని దొడ్లోకి వెళ్ళాడు. ప్రార్థన చేసుగుని పడుకున్నాడు. కాని, నిద్రించలేకపోయాడు. ఒకపక్షంచూస్తే, అతడు వెళ్ళవలిసినవిధి, ఇక్కడికే మరీ ఆలస్యమూ అయింది, సొమ్మూ అయింది. మరోపక్షం: ఆ యింటివాళ్ళ గురించి బాధ కలుగుతోంది. అతడు, 'దీనికేమీ అంతం ఉండేటట్టు కనిపించడం లేదు. మొట్టమొదట్లో వీళ్ళకి కాసిని నీళ్ల తెచ్చిపెట్టి, తలో రొట్టి ముక్కా యిచ్చి నాదార్ని నేను పోవాలని సంకల్పించి ఇందులో దిగాను. చూడండి నాకిప్పుడెల్లా వచ్చిందో! మరి కర్తవ్యం ఏమిటీ అంటే, పొలమూ బీడూ విడిపించడమే. అది అయిన తరవాత వీళ్ళకి ఓ ఆవునీ, ధాన్యంపనలు తెచ్చుగోడానికి ఓ బండీ గుర్రాన్నీ కొనిపెట్టాలి. మహా తమాషా వ్యూహంలో చిక్కుగున్నావోయ్, ఎలీషా శ్రోధర్హా! ఓడ తాళ్ళు జారవిడిచావు, లెఖ్ఖ

చూసుగోడానికి ఉండేఇమ్ము పోగొట్టుకున్నావు,' అనుకున్నాడు. అతడులేచి తలకింద పెట్టుగున్న కోటుతీసి, విప్పి, పొడుంతీసి ఒఖ్ఖపట్టు తగిలించాడు, తద్వారా ఆలోచన కాస్త తేరుకుంటుం దేమో అనే ఊహతో! కాని, అబ్బే! ఎంతేనా ఆలోచించాడు. కాని తుదినిశ్చయం ఫలానా అని తేల్చలేకపోయాడు. అతడు విధిగా వెళ్ళితీరాలి. కాని, కనికరం అతణ్ణి పట్టేసింది. ఎంజెయ్యాలో అతడికి తెలియలేదు. మళ్ళీ కోటు మడతపెట్టి తలకెంద పెట్టుగున్నాడు. అల్లా చాలాసేపు తొలికోడి కూసిందాకా కుడా పడుకుని ఉన్నాడు. అప్పటికే అతనికి చాలా బద్ధకం వచ్చేసింది. అథాత్తుగా ఎవరోవచ్చి తనని లేవగొట్టినట్టు అతనికి కనపడింది. తను ప్రయాణవేషం ధరించి, సంచీ భుజానికి తగిలించి వీపుమీద వేసుకుని, చేత్తో కర్రపట్టుగుని, ఓరవాకలిగా ఉన్న ద్వారంలో సరిపడేటట్టు ముణుచుగుని బయటపడి, సాగి పోవాలని చూస్తూన్నప్పుడు వీపుమీద సంచీ ఒక పక్కనున్న కంచెకి చిక్కడడం తను కనిపెట్టి ఆ చిక్కు వదుల్చుగునే యత్నంలో కాలి కట్టుచుట్టువెళ్లి రెండోవేపున్న కంచెకి చిక్కడి ఊడి అవతలపడడం గమనించి, తీరా సంచిలాగి చూడగా ఆ పట్టుగుంటా కంచెకాదు—'రొట్టె, నాన్నా, రొట్టి' అని ఏడుస్తూ అంటూన్న ఆ చిన్నపిల్లే అయినట్టున్నూ, అట్లాగే కాలి కట్టుకేసి చూడగా ఈ పట్టుగుంటాకుడా కంచెకాదు—ఆ చిన్ని కుర్రాడే అయినట్టున్నూ, ఇంటి యజమానీ ముసలమ్మాకుడా తనకేసి కిటికీల్లోంచి చూస్తూన్నట్టున్నూకుడా అతనికి కనపడింది. ఎలీషా మేలుకుని, పైకి వినపడేటట్టు ఇల్లా అన్నాడు: రేపు

వెళ్లి వీళ్ళపొలం విడిపిస్తాను. వీళ్ళకి గుఱ్ఱం కొంటాను, పంటల దాకా సరిపడ పిండి కొంటాను, పిల్లలగురించి ఒక ఆవుని కొంటాను, అల్లాగనక చెయ్యకపోతానా, దేవుడికోసం సముద్రాల అవతల వెదకడానికి వెళ్లడంలో, నా లోపలే ఉంటూన్న దేవుణ్ణి నష్టపోవచ్చు.' అని.

తరవాత అతనికి నిద్రపట్టింది, ఉదయందాకా పడుకున్నాడు. కొంచెం ముందుగానేలేచి, ఆ మోతుపరి రైతుదగ్గిరికి వెళ్ళి ఆ పొలమూ ఆ బీడూకుడా విడిపించేశాడు. ఓ కొడవలికొని (ఎందుకంటే వాళ్ల కొడవలికుడా అమ్మేసుగున్నారు వాళ్లు) పట్టుగువచ్చాడు. ఆ మనిషిని కోతకి పంపి తను ఊళ్ళోకి వెళ్లాడు. ఒక గుఱ్ఱమూ బండీ అమ్మకానికి హోటల్ దగ్గిర ఉన్నాయని విని, తక్షణం అక్కడికివెళ్లి బేరం పైసలుచేసి, కొనేశాడు. ఓ సంచీ పిండికొని అవి బండిలోపడేసి, ఆవుసంగతి చూడడానికి వెళ్లాడు. దారిలో మాటలు చెప్పుగుంటూ నడుస్తూన్న ఇద్దరి స్త్రీలని వెనకనించి సమీపించాడు. వాళ్ల చిన్నరష్యా మాండలికంలోవాళ్ళు మాట్లాడుకున్నా, అతనికి అర్థం అయింది. 'మొదట ఆయన్ని వాళ్లు తెలుసుగోలేదుట, సాధారణపు మనిషే కదా అనుకున్నారట. తాగడానికి మంచినీళ్లు అడిగేందుకు లోపలికివెళ్లి, అక్కడఉన్నాడుట. వాళ్లకి ఆయన ఎన్నెన్ని కొని పెట్టాడో విన్నావా! అబ్బే ఈవేళ పొద్దున్నంటే పొద్దున్న గుఱ్ఱమూ బండీ కొనిపెట్టాడట హోటలుదగ్గిర. భూమిమీద అల్లాంటివాళ్ళు అట్టేమందిలేరు. ఆయన్ని ఒక్కసారి చూడడానికి వెడితే ఆకాలం సద్వినియోగం అవుతుంది' అంటూ ఒక

స్త్రీ రెండోఆమెతో చెబుతోంది. అదంతావిని తనమీద అప్పుడే స్తోత్రాలు మొదలెట్టారని ఎలీషా గ్రహించుగుని, ఆవుని కొన డానికి వెళ్లనేవెళ్లక, హోటలుకి వెళ్ళిపోయి, ఇయ్యవలిసింది పూర్తిగా చెల్లించేసి, గుర్రాన్ని బండికిపూన్చి, బండిమీద ఇంటికి వెళ్ళి దిగాడు. ఇంట్లో అంతా ఆ గుర్రాన్ని చూడగానే ఆశ్చర్య పడిపోయి తమకోసమేమో అనుకున్నారుగాని, అడగడానికి వాళ్లకి గుండెధైర్యం లేకపోయింది. యజమాని గేటు తెరవ డానికి వెళ్ళి, 'గుర్రం ఎక్కడిది, తాతగారూ?' అని అడిగాడు. 'ఏం? కొనేశాను. చౌకగా పోతోంది. వెళ్ళి కొంచెం గడ్డికోసి సాలలో వెయ్యి, రాత్రి తింటుంది. సంచీ లోపలపెట్టు,' అని ఎలీషా చెప్పాడు.

ఆ మనిషి గుర్రాన్ని విప్పేసి, సంచీ పట్టిగెళ్లి గాదెలో పెట్టాడు, కొంచెం గడ్డికోసి సాలలోవేశాడు. ప్రతీ ఒకరూ నిద్ర పోవడానికి పరున్నారు. ఎలీషామాత్రం ఇంటిబయట రోడ్డు దగ్గిరిగా బిచాణావేశాడు. ఆవేళ అతని సంచీకుడా కూడానే ఉంది. అందరికీ నిద్ర పట్టనిచ్చి, లేచి, అన్నీ సంచీలో పెట్టు గుని, అది గట్టిగా కట్టేసి, కాళ్లచుట్టూ పీలికలు చుట్టుగుని చెప్పులూ కోటూ తొడుక్కుని, బయల్దేరి వెళ్లాడు ఎఫీమోని అందుకోడానికి.

## vii

ఎలీషా మూడుమైళ్ళకంటె ఎక్కువే అనాలి నడిచింతరవాత తెల్లవారడం మొదలెట్టింది. అతడు ఓచెట్టుకింద కూచుని, సంచి తీసి, ఉన్నసొమ్ము లెఖ్ఖపెట్టగా పదిహేడు రూకలూ పైన ఇరవై

విన్న డబ్బులూ మిగిలాయి. అతడు తనలో, 'సరి. ఈ మాత్రంతో సముద్రం దాటాలని యత్నించి లాభంలేదు. దారి పొడూగునా ముష్టెత్తుగుంటూ వెళ్ళడం, అసలు వెళ్ళకుండా ఉండడంకంటె మరీపాడు. నేను తనకూడా లేకుండానే నేస్తం ఎఫీమో యెరూషలేం జేరుకుంటాడు, నాపేరుచెప్పి గుళ్ళల్లో కొవ్వొత్తి వెలిగిస్తాడు. ఇక నావిషయం, ఈ జీవితంలో నా మొక్కు నేను చెల్లించుగోనేలేనని నాభయం. పాపుల్ని క్షమిస్తూ కనికరం వహిస్తూ ఉండే ప్రభువుకే నేను మొక్కుగుని ఉన్నం దుకు నేనెంతైనా కృతజ్ఞుణ్ణయి ఉండాలి.'

ఎలీషా లేచి, ఒక్క ఊపుతో సంచీవెళ్ళి భుజాలవెనక్కి ఎక్కేటట్టుచేసి, వెనక్కి తిరిగాడు. తనని ఎవరూ గుర్తుపట్ట కుండా చేసుగోడానికి, ఆగ్రామంలోంచి వెళ్ళక, ఓ చుట్టుదారిపట్టి తన ఊరివైపు గబగబా నడిచాడు. వచ్చేటప్పుడు ఆదారి ఎంతో కష్టమైన దారిలా కనపడింది, ఎఫీమో సరసనే నడవవలిసిరావడం అతనికి ఎంతో శ్రమ అనిపించింది. కాని, తిరుగుప్రయాణంలో అతనికి ఆయాసం అనేది అనిపించకుండా అతడు అంతమేరా దాటడానికి దేవుడతనికి తోడ్పడ్డాడు. అతనికి నడక కుర్రాడికి ఆటలాగ కనిపించింది. చేతికర్ర ఊగిస్తూ రోజుకి నడవవలిసిన నలభై యాభైమైళ్ళూ అతడు నడిచేశాడు.

ఎలీషా ఇల్లు చేరుకునేసరికి పంటకాలం దాటిపోయింది. అతడు తిరిగి యిల్లు చేరుకున్నందుకు అతని వాళ్ళంతా ఆనం దించారు. అందరూ సుడా, ఏమేమి జరిగింది? అతడు ఎందుకు

[illegible] సొంగాస లేం చేరుకో

కుండా అతడు వెనక్కి వచ్చేశాడేమి? అని అడగడం మొదలెట్టారు. ఎలీషా వాళ్ళతో ఏమీ చెప్పలేదు. 'నేనక్కడికి వెళ్ళడం దేవుడి ఇచ్ఛకాదు. దారిలో నాసొమ్ము పోగొట్టుగున్నాను, అందుకని నేను నా స్నేహితుడికి వెనకయాను. దేవుడిమొహం చూసి, నన్ను క్షమించండి,' అని మాత్రం అతడన్నాడు. తనదగ్గిర మిగిలిన సొమ్మంతా అతడు తన భార్యకిచ్చివేశాడు అప్పుడు ఇంటివ్యవహారాలగురించి అతడు వాళ్ళని అడిగాడు. అన్నీ సవ్యంగానే జరిగిపోతున్నాయి, పన్లు అన్నీ పూర్తిఅయినాయి, దేన్నీ వాళ్లు ఉపేక్షచెయ్యలేదు, అందరూకుడా సఖ్యతగా కలిసి మెలిసి ఉంటున్నారు.

ఇతడు ఇంటికివచ్చేసినట్టు ఎఫీమో కుటుంబం ఆ రోజునే విని, తమ ముసిలాయనగురించిన సంగతులకోసం రాగా, వాళ్ళకికుడా ఎలీషా వెనకటిమాదిరి సమాధానాలే ఇచ్చాడు. 'ఎఫీమో నా కంటె వడిగల నడకవాడు. పేతురుఋషి వర్ధంతికి మూడురోజుల క్రితం మేం విడిపోయాం. వెళ్ళి అతణ్ణి పట్టుగోవాలని నేనను కున్నాను, గాని రకరకాలసంగతులు జరిగాయి, నాసొమ్ము పోయింది, ముందుకి వెడదాం అంటే ఆధారం కనిపించలేదు, దాన్తో నేను వెనక్కి వచ్చేశాను' అని అతడు చెప్పాడు.

జనం అంతాకుడా, అంతప్రాజ్ఞుడైనమనిషిఅంతబుద్ధిహీనంగా ప్రవర్తించనా, బయల్దేరినవాడు గమ్యస్థానం చేరకుండా ఉండనా, సొమ్మంతా చిమ్మేసుగోనా, అని ఆత్యాశ్చర్యపడిపోయారు. వాళ్ళల్లా ఆశ్చర్యపడతా కొద్దికాలమే! ఆ తరవాత దాన్నిగురించి, వాళ్ళు పూర్తిగా మరిచేపోయారు. వాళ్లేకాదు, ఎలీషాకుడాసూ.

ఇంటిపట్టున అతడు మళ్ళీ పని ప్రారంభించాడు: కొడుకుని తోడుతీసుగుని అతడు శీతకాలానికి సరిపడ వంటచెరుకు కొట్టాడు. తనూ ఆడవాళ్ళూ పనలునూర్చారు. తనే పెరటియిళ్ళమీది రెల్లు గడ్డి తిరగేశాడు, తేనెటీగలకి మూతలు చేశాడు, పక్కింటి ఆసామీకి తను వసంతంలో అమ్మిన పది తేనెపట్లూ మరి వాటిలోంచి వచ్చిన అన్ని దండులూ అప్పగించేశాడు. ఆ పది పట్లలోంచీ ఎన్ని కొత్తదండులు వచ్చాయో చెప్పకుండా ఉండా లని అతని భార్య యత్నించింది. కాని, ఏపట్టునించి కొత్త దండు రాగలదో దేన్నించి రాదో ఎలీషాకి తెలుసును గనక, ఆ పదిబదులు పదిహేడు అప్పచెప్పాడు పక్కింటివాడికి, శీత కాలానికి సర్వమూ సిద్ధంచేసి, పని నిమిత్తం కొడుకుని దూరం పంపేసి, ఎలీషా చెప్పులకి మట్టలు అల్లడంలోనూ పట్టులకి దుంగలు దొలవడంలోనూ పడ్డాడు.

## viii

మంచినీళ్ళకని వెళ్ళి ఆ రోగిష్టివాళ్ళ ఇంట్లో ఎలీషా ఆగిపోయి నప్పుడు, ఎఫీమో అతనికోసం నిరీక్షించాడు. అట్టే సాగిపోకుం డానే, కూచున్నాడు. ఎంతసేపైనా కనిపెట్టుగున్నాడు, ఓ నిద్దర తీశాడు, మేలుకున్నాడు, ఇంకా కాచుగునే ఉన్నాడు. కాని. అతని నేస్తం రాలేదు. కళ్ళు నెప్పిపెట్టేటట్టు రెప్పవెయ్యకుండా అతడు రావలసినవేపు చూశాడు. అప్పుడే సూర్యుడు చెట్టుచాటున దించుగు పోతున్నాడు, ఇంకా ఎలీషా కనిపించడాయె. అతడు, ఒకవేళ నన్ను దాటి వెళ్ళిపోయుండచ్చు. బహుశా ఇతన్ని ఎవరేనా తమ బండిలో ఎక్కించుగుంటే, నాకు నిద్దరపట్టిన

సమయంలో, అది యీ పక్కనించి వెళ్ళేటప్పుడు అతడు నన్ను చూడలేదేమో. కాని, నన్ను చూడకుండా ఉండడం ఎల్లా? ఈ బంగనబయల్లో ఎంతదూరమైనా కనిపిస్తుందే! పోనీ, వెనక్కి వెడుదునా? కాని, అతడు ముందుకే వెళ్ళుంటే మేం ఒకళ్ళ కొకళ్ళం అసలు కనపడనే కనపడం. అది మరీపాడు కుడానూ. నేను ముందుకి పోవడమే నయం, రాత్రిబసవో టేనా తప్పకుండా తారసిల్లగలం,' అనుకున్నాడు. అతడు నడుచుగుంటూపోయి, ఒక గ్రామం చేరుకుని, ఊరికాపలామనిషితో, ఫలానామోస్తరుగా ఉండే ముసిలాయన ఈదార్నే వస్తాడు, నా మకాం ఫలానా, ఆయన్ని అక్కడికి రమ్మను అని కోరుతూ చెప్పాడు. కాని, ఎలీషా ఆ రాత్రీ రాలేదు. పాపం ఎఫీమో ఒక్కడూ సాగి వెళ్ళాడు. దార్లో కనిపించిన ప్రతీవాణ్ణీ, మీకుగాని ఒక ముసిలాయన కనపడ్డాడాండీ, పొట్టిగా ఉంటాడు బట్టతలా? అంటూ ప్రశ్నించాడు. అల్లాంటి ప్రయాణీకుణ్ణి చూసిన మనిషేలేడు. ఎఫీమో ఆశ్చర్యపడి, ఒంటరిగానేపోతూ, 'ఒడెస్సాలో మేం రూఢిగా కలుసుగోగలం. లేకపోతే, ఓడమీద తప్పదు' అనుకుని, ఆ విషయంగురించి బాధపడడం మరి మానుకున్నాడు. దార్లో అతనికి ఒక యాత్రికుడు తటస్థపడ్డాడు. ఆ యాత్రికుడికి అంగీ, పొడుగుజుట్టూ, మాడపట్టుని డిప్పటోపీ ఉన్నాయి ఫాదిరీకి ఉండే లాగ. ఆయాత్రికుడు అతాస్‌కొండ ఎక్కివచ్చి ఇప్పుడు రెండో సారి యెరూషలేం వెడుతున్నాడు. ఒకరాత్రి వాళ్ళు ఒకేచోట బసచేశారు. కలిశారు గనక, వాళ్ళు కలిసే ప్రయాణం చేశారు. వాళ్ళు ఒడెస్సాక్షేమంగానే చేరుకున్నారు, కాని ఓడకోసం

మూడు రోజులు అట్టే ఉండవలిసొచ్చింది. వీళ్లేకాదు, ఎక్కణ్ణించి ఏక్కణ్ణించో వచ్చిన బోలెడుమంది యితర యాత్రికులూ అంతే. ఎలీషా కనిపించాట్టండీ అంటూ ఎఫీమో మళ్ళీ వాకబు చేశాడు. అతణ్ణి చూసిన మనిషేలేడు. అయిదు రూకలిచ్చి తన విదేశ గమనానికి ఎఫీమో యోగ్యతాపత్రం పుచ్చుగున్నాడు. ఓ నలభై రూకలెట్టి యెరూషలేముకి తిరుగు టిక్కట్టు కొన్నాడు. ఓడ ప్రయాణంలో సమృద్ధిగా సరిపోయే రొట్టీ ఎర్రలూ కొని పడేసు గున్నాడు. యాత్రికుడు ఎఫీమోని కూచోపెట్టి, ఓడకేవు దమ్మిడీ కుడా చెల్లించక్కర్లేకుండా ఓడ ఎల్లా ఎక్కెయ్యచ్చో బోధపరచడం మొదలెట్టాడు. కాని, ఎఫీమో ఆమాటలు చెవిని పెట్టక, 'ఛీ. నేను చెల్లించడానికి సిద్ధంచేసుగునే వచ్చాను, చెల్లిస్తాను' అన్నాడు. ఓడమీదికి సరుకు ఎగుమతీ కాగానే, యాత్రికులు ఏక్కేశారు. వాళ్ళల్లో ఎఫీమో అతని కొత్తనేస్తమూ ఉన్నారు. లంగర్లు ఎత్తేసి, ఓడని సముద్రం మీదికి వదిలారు.

పగలంతా జలయానం సజావుగానే సాగింది, కాని రాత్రి పడ్డాక ఈదురు మొదలెట్టి, వానకురిసింది. ఓడ ఒకవేపునించి ఒకవేపు ఊగి నీరోసుగుంది. జనం హడిలిపోయారు. ఆడవాళ్ళు కీచుమంటూ రాగాలుకుడా మొదలెట్టారు. అందులో మరీ అధైర్య పడ్డవాళ్ళు దాక్కునేటందుకు ఇటూ అటూ పరుగులెత్తారు. ఎఫీమో కుడా చాలా భయపడిపోయాడుగాని, తన భయం పైకి తెలియకుండా జాగ్రత్తపడి, ఓడ ఎక్కగానే తాను అంతస్థుమీద మొట్టమొదట్లో తనెక్కడ కూచున్నాడో ఆ స్థలాన్నే అంటిపెట్టు గుని కూచున్నాడు. అక్కడే తాంబోసగరం నించివచ్చిన ముసి

లాళ్ళు కొందరున్నారు. వాళ్లందరూ కుడా, ఆ రాత్రి మర్నాడూ కుడా, ఎవళ్ళమూటలు పట్టుగుని వాళ్ళు వేళ్ళాడుతూ, మౌనంగా అల్లాగే కూచుండిపోయారు. మూడోనాటు వాతావరణం ప్రశాంతం అయింది. అయిదోనాడు కాన్‌స్టాంటినోపిల్ (అంకోరా) దగ్గిర లంగరు దించారు. కొందరు యాత్రికులు సోఫియాఋషీశ్వరి గుడి చూడడానికి గట్టుమీదికి వెళ్ళారు. అ గుడి ఇప్పుడు తురకలకింద ఉంది. ఎఫీమో ఓడమీదే దిగడీ, కొంచెం తెల్లరకం రొట్టె కొనుక్కున్నాడు. అక్కడ ఇరవై నాలుగు గంటలుండి, బయల్దేరి మళ్ళీ సముద్రం మీదపోయారు. స్మర్నా వద్దా అలెగ్జాండ్రెట్టా వద్దాకుడా వాళ్ళు ఆగుతోచ్చి, చిట్ట చివరకి క్షేమంగానే జాఫా చేరుకున్నారు అక్కడ యాత్రికు లంతా మరి దిగిపోవలిసిందే, అక్కణ్ణించి సుమారు నలభై మైళ్లు రోడ్డుప్రయాణం చేస్తే యెరూషలేం తగుల్తుంది. ఓడ దిగేటప్పుడు జనం ఎంతో భయపడిపోడం మొదలెట్టారు. ఓడ ఎత్తుగనక అక్కణ్నించి జనాన్ని కిందున్న పడవల్లోకి పడదించారు. ఆ పడవ ఊగీసలాట చెప్పశక్యమేకాదు. అందులోవాళ్ళు పట్టు తప్పారా మహాసుళువుగా పడచ్చు నీళ్ళల్లో. ఓ యిద్దరికి అల్లాంటి స్నానం అయింది కాని, చివరికి అంతా కుడా క్షేమంగా నేలమీద అడుగెట్టారు.

వాళ్ళు నడిచే పోయారు. మూడోనాడు మిట్టమధ్యాహ్నానికి యెరూషంలేం చేరి, నగరానికి బయటనే ఉన్న రష్యాహోటలులో వాళ్ళు దిగగా వాళ్ళ యోగ్యతాపత్రికల్ని ఉద్యోగులు పద్ధి పులజూరు చేశారు. భోజనానంతరం ఎఫీమో తన నేస్తం

అయిన యాత్రికుడితో కలిసి పవిత్ర స్థలాలన్నీ దర్శించాడు. 'పవిత్ర సమాధి' యొక్క దర్శనానికి జనాన్ని వెళ్ళనిచ్చే అదను అది కాకపోవడం వల్ల, వాళ్ళు 'కులగురు ప్రభువుల కొలువు'కి వెళ్ళారు. యాత్రికు లందరూ అక్కడ సమావేశం అయారు. ఆడవాళ్ళని ప్రత్యేకించారు. మొగాళ్ళని వలయాకారంలో, పాదాలకి ఏమీ లేకుండా, కూచోండన్నారు. తరవాత ఒక యోగి వాళ్ళ పాదాలు కడగడానికి వచ్చాడు, తువ్వాలు కుడా పుచ్చుగుని. అతడు ఒకడి పాదాలు కడిగి, తుడిచి, ముద్దెట్టుగున్నాడు. ఇల్లాగే ఆ వలయంలో ఉన్న ప్రతి ఒకడి పాదాలూ కడిగి, తుడిచి, ముద్దెట్టుగున్నాడు. కడంవాళ్ళ పాదాలతోపాటు ఎఫీమో పాదాలు కుడా కడగబడి ముద్దెట్టుగోబడ్డాయి. సాయం ప్రార్థనలప్పుడూ ఉదయ ప్రార్థనలప్పుడూ అవి పూర్తి అవుతూండే దాకా ఎఫీమో నిలబడేఉండి ప్రార్థించాడు. గుళ్ళల్లో కొవ్వొత్తులు పెట్టించాడు. తన తల్లిదండ్రుల పేర్లు లిఖింపబడి ఉన్న చిన్ని పుస్తకాలు పూజార్లకందించి వాళ్ళచేత ఆ పేర్లు గుడి ప్రార్థనల వేళల్లో చదివింపించాడు. ఈ కులగురు ప్రభువుల కొలువులో యాత్రికులకి ఆహారమూ మద్యమూ కుడా ఇచ్చారు. అక్కణ్ణించి వాళ్ళు అబ్రహాం ఆశ్రమానికి వెళ్ళి అక్కడ అబ్రహాం తన పుత్రుణ్ణి సంహారించి దేవుడికి బలిగా అర్పించ దల్చుకున్న స్థలం చూశారు. తర్వాత మగ్దలేనే మరియకి క్రీస్తు కనిపించినచోటూ ప్రభుసోదరుడైన యాకోబు గుడీ దర్శించారు. యాత్రికుడు ఎఫీమోకి ఈ భాగాలన్నీ చూపించ

డమేకాక, ఒక్కొక్కచోట ఎంతెంత చెల్లిస్తూండాలో కుడా చెప్పాడు. మిట్టమధ్యాహ్నానికి వాళ్ళు తిరిగి హోటలుకి వచ్చేసి భోజనం కానిచ్చారు. కాస్తఒరిగి విశ్రమిద్దామని వాళ్ళు ఆయత్త పడుతూండగా, ఆ యాత్రికుడు గొల్లుమంటూ తన దుస్తులన్నీ పైకిలాగి జేబూలన్నీ తిరగేసి నానా హడావిడీ చేస్తూ 'అయ్యో! నా పర్సు ఎవడో కొట్టేశాడు. అందులో ఇరవైమూడు రూకల సొమ్ముంది, రెండు పదిరూక నోట్లూ, తక్కింది చిల్లరానూ' అన్నాడు. అతడు నిట్టూర్చాడు, బాగా ఏడిచాడు. కాని ఎవడు చేసేదీ ఏమీ లేకపోబట్టి వాళ్లు నిద్రించాలని పడుకున్నారు.

## ix

అలా ఎఫీమో పరున్నప్పుడు వ్యామోహంవచ్చి అతణ్ణి ఎదుర్కొంది. 'ఈ యాత్రికుడి దగ్గిర్నించి సొమ్ము ఎవ్వడూ తస్కరించలేదు. అసలతని దగ్గిర ఏమన్నా ఉండేదనికుడా నేను నమ్మను. ఎక్కడా కుడా అతడు ఏమీ ఇయ్యలేదు, నాచేత ఇప్పించాడుగాని. పైపెచ్చు నా దగ్గిర ఒకరూక బదులుచ్చుగున్నాడు.' అని అతదనుకున్నాడు. ఈ ఊహ అతడి మనస్సులోకి వచ్చి ఇల్లా దాటి వెళ్లీ వెళ్ళకుండానే ఎఫీమో తనని తను మందలించుగుంటూ, 'ఛీ, ఒక మనిషిమీద తీర్పు చెప్పడానికి నాకు హక్కేముందీ? అది పాపం. దాన్నిగురించి మరి నే నాలోచించను' అనేసుగున్నాడు. కాని, అతని ఆలోచనలు ఇటూ అటూ కాస్త విహరించినట్టే విహరించి, మళ్ళీ ఆ యాత్రికుడికేసే తిరిగాయి—సొమ్మంటే వాడికి ఎంత ఆసక్తి ఉన్నట్టు కనపడ్డాడో, తన పర్సు ఎవరో తస్కరించారని అతడు చేసిన

ప్రకటనయొక్క రీతిలోనే అబద్ధం ఎల్లా ధ్వనించిందో—మొద లైనవి. 'వాడిదగ్గిర ఏమిటి, సొమ్మేమిటి? అదంతా వాడి అభూతకల్పన' అని తోచింది ఎఫీమోకి.

సాయంత్రం పడుతుందనగా ఇద్దరూలేచి, ప్రభువు సమాధి ఉన్నచోటే 'పునర్జన్మ' క్షేత్రంలోని మహాలయానికి వెళ్ళారు, అక్కడ నిశివేళ ప్రభువు అంత్యభోజన స్మారక ఉత్సవం చూడాలని. యాత్రికుడు ఎఫీమోతోకూడా తోకలాగ ఉంటూ, ఎఫీమో ఎటు నడిస్తే అటే నడిచేవాడు. వాళ్ళు మహాలయానికి వచ్చారు. అక్కడ చాలా చాలామంది యాత్రికు లున్నారు— కొందరు రష్యనువారు, కొందరు ఇతరజాతులవారు, గ్రీకులు, ఆర్మీనియావారు, తురుష్కులు, సిరియావారు. ఆ సమూహంలో ఎఫీమో తనుకూడా ఆ పవిత్ర సింహద్వారం దాటాడు. తురుష్క రక్షకభటులు బరాబరు చేసిఉండగా వాళ్ళపక్కనించి ఒకయోగి వీళ్ళని నడిపించుగుని వెడుతూ: రక్షకుణ్ణి శిలువమీదినించి దింపి తైలాభిషేకం చెయించిన చిహ్నంగా తొమ్మిది పెద్దపెద్ద గోట్టాలలో వెలుగుతూన్న తొమ్మిది కొవ్వొత్తులు గల చోటు చూపించాడు. ఆయోగి చూపిస్తూ ప్రతిదీ విశదపరిచాడుకుడానూ. ఎఫీమో అక్కడ ఒక కొవ్వొత్తి అర్పించాడు. తరవాత యోగి ఎఫీమోని కుడివేపున కపాలస్థలంలోకి వెళ్ళే మెట్లెక్కించి, శిలువ నిలిచిఉన్నచోటికి తీసిగెళ్ళాడు. అక్కడ ఎఫీమో ప్రార్థించాడు. ఆ తరవాత, భూమి అట్టడుగునించీ రెండు చెక్కలుగా విడిపోయిన పగులు: క్రీస్తు చేతులూ పాదాలూ శిలువని పెట్టి మేకులుకొట్టిన స్థలం: ఆదాం ఎముకలమీద క్రీస్తురక్తం బొట్టు

బొట్టుగాపడిన ఆదాంగోరీ: ముళ్ళకిరీటం ఆయన తలమీదఉంచే సందర్భంలో క్రీస్తు కూర్చున్నరాయి! క్రీస్తుని కొరడాదెబ్బలు కొట్టినప్పుడు ఆయన్ని కట్టేసిన స్తంభం—ఇవన్నీ ఎఫీమోకి చూపించారు. క్రీస్తు కూచున్నప్పుడు తన పాదాలుంచిన రాయి ఆనవాళ్లతోసహాకూడా ఎఫీమో చూశాడు. వాళ్ళు ఇంకా ఏమేమో అతనికి చూపించబోతూండగా, మూకలో ఏదో చలనం బయల్దేరి, జనం అంతాకుడా పవిత్రసమాధి ఆలయానికేసే ఎగపడ్డారు. ఏమంటే: అక్కడ స్మారకోత్సవంలో లాటిన్‌భాషలో జరగ వలిసిన భాగం పూర్తిఅయి, రష్యాజాతివాళ్ళ బహిరంగ దైవ ప్రార్థన ప్రారంభం కానుంది. ఆ మూకలోపడి ఎఫీమోకుడా కొండలో దొల్చిన ఆ సమాధి దగ్గిరికి వెళ్ళాడు ఆ యాత్రికుణ్ణి విరగడచేసుగోవాలని అతడు మహాయత్నించాడు, వాణ్ణి శంకించి తనమనస్సులో పాపం ఇంకా మూటకట్టుగుంటూ! కాని, ఆ యాత్రికుడు ఇతణ్ణి వదలక పవిత్రసమాధిలో ఉత్సవానికికుడా ఇతడిపక్కనే తయారయాడు. ఎదటికెళ్ళి పడాలనుకున్నారుగాని, వాళ్ళు మరీ ఆలస్యం చేశారు. వెనక్కిగాని ముందుకిగాని జరగడం అసంభవం అనేటంత పెద్దమూక పోగైంది. ఎఫీమో తనదృష్టి ఎదటికే నిగిడ్చి, ప్రార్థనచేస్తూ, ఇప్పుడోమాటూ అప్పుడోమాటూ తనపర్సు ఉందో పోయిందో చూసుగుంటూ నుంచున్నాడు. అతడి ఆలోచన రెండిందాల నడిచింది. ఒకొ్కక్కప్పుడు అతడు ఆ యాత్రికుడు తనని మోసగిస్తున్నాడను కునేవాడు. మళ్లీ ఒకప్పుడు ఆ యాత్రికుడు సత్యమే చెప్పి ఉండి వాడి పర్సు తస్కరింపబడడం యథార్థమే అయితే, తనకి గూడా అంత ముప్పటా జరగ వచ్చుగదా అనుకునేవాడు.

X

ముప్పైఆరు జ్యోతులకింద కనపడుతూన్న ఆ పవిత్రసమాధి గల ఒక చిన్న ఆలయంలోకి రెప్పవెయ్యకుండా చూస్తూ ఎఫీమో నిలబడిపోయాడు. జనంయొక్క తలలమీదికి అతడు తనదృష్టి ఎత్తినప్పుడు అతనికి పరమాశ్చర్యం కలిగించే విషయం గోచరించింది. పవిత్రాగ్ని మండుతూండే ఆ జ్యోతులకింద, అందరికీ ఎదట ఒక ముసిలివాడు బూడిదరంగు కోటు తొడుక్కుని అద్దంలా తళతళలాడే బట్టతలతో అచ్చంగా తన స్నేహితుడైన ఎలీషాలాగ కనిపించాడు. 'అతనిలా ఉన్నా డంతేకాని ఎలీషా అనడానికి వీల్లేదు. నాకంటె ముందరాశే అతడు వచ్చుండలేడు. మా క్రితం ఓడ వారంక్రితమే బయల్దేరి వెళ్లిందిట. అందుకని, అందులో ఆతడు ఎక్కి ఉండడం అసంభవం. మరి మా ఓడలో అత డెక్కడాలేడు. మా ఓడెక్కిన ప్రతి యాత్రికుడి మొహమూ చూసి మరీవదిలాను,' అని అతడు తనలో అనుకున్నాడు. ఎఫీమో ఇల్లా అనుకున్నాడో లేదో, వెంటనే ఆ చిన్నిముసిలివాడు ప్రార్థన చెయ్యడం ప్రారంభించి, మూడుసార్లు శిరస్సుతో వందనం చేశాడు, ఒకసారి ఎదట దేవుడికి, రెండుసార్లు చెరో పక్కా ఉన్న సోదరులకి. అతడు తన తల కుడిపక్కకి తిప్పినప్పుడు, ఎఫీమో అతణ్ణి గుర్తుపట్టాడు. అతడు కేవలం తన నేస్తం ఎలీషాయే—దవడలదగ్గిర బూడిదరంగుగా మారిన అతని నల్లటి ఉంగరాలగడ్డమే, అతడి కనుబొమలే, అతడి కళ్ళే, అతడి ముక్కే, అతడి ముఖప్రకటనే! అవ్వే. అచ్చంగా అతడే! మళ్లీ ఎల్లాగో తన నేస్తాన్ని పట్టుగోగలిగినందుకు

ఎఫీమోకి చాలా సంతోషం వేసింది, గాని తనకంటెముందు అత డెల్లా రాగలిగాడా అనిమాత్రం ఆశ్చర్యం వేసింది. అతడు 'మొత్తానికి గట్టివాడివోయ్, ఎలీషా! లేకపోతే చూడండి తోసు గుని ముందుకి ఎల్లా వెళ్ళాడో! ముందుకి వెళ్ళడానికి దారి ఎరి గున్నవా డెవడేనా కనపడి అతణ్ణి తీసుగువెళ్ళుంటాలి. అంతా బయటికి రాగానే నే నతణ్ణి పట్టుగుని, డిప్పటోపీ అధాజను ణ్ణి విరగడచేసుగుని, ఎలీషాతోకూడానే ఉంటాను. ముందుకి వెళ్ళ డానికి దారేమిటో నాకు బహుశా అతడే చూపిస్తాడు' అను కున్నాడు. ఎలీషా తన దృష్టిపథంలోంచి తప్పిపోతాడేమో అనే భయంచొప్పున ఎఫీమో దిక్కులు చూడడంకుడా మానేశాడు. కాని, ప్రార్థనానంతరం. సమాధిని ముద్దెట్టుగోవాలనే తహ తహతో ముందుకి తోసుగుంటూ ఊగే జనతరంగాలు ఎఫీమోని ఒక పక్కకి నెట్టేశాయి. తన పర్సు ఎవడేనా కొట్టేస్తాడేమో అనే భయం అతణ్ణి మళ్లీ పట్టుగుంది. పర్సు చేత్తో అదిమిపెట్టి, బయటపడితే చాలనే ఆదుర్దాతో, మోచేతులు గుచ్చి మూకని చీల్చడం మొదలెట్టాడు. కాస్త ఖాళీస్థలం చేరుకోగానే, అతడు ఎలీషాకోసం ఎంతోసేపు నలుముఖాలా బయటా ఆలయంలోనూ కుడా గాలించాడు. మహాలయంలోని చిన్నిచిన్ని గుళ్ళల్లో రక రకాల మనుషులు బోలెడుమంది తింటూ తాగుతూ చదువుతూ నిద్రిస్తూ కనిపించారేగాని, ఎలీషామాత్రం ఎక్కడా కనబడలేదు. అందుకని పాపం ఎఫీమో తన నేస్తాన్ని పట్టుగోలేకపోయి హోటలికి వచ్చేశాడు. ఆ సాయంత్రం డిప్పటోపీ యాత్రికుడు మొహమే చూపించలేదు. వాడు ఆ రూక బాకీ చెల్లించకుండా చక్కాపోయాడు, ఎఫీమో ఒంటరిగా ఉండిపోయాడు.

తంబోనగరంనించి వస్తూ ఓడలో తనకి పరిచయపడ్డ ఒక ముసిలాయనతో కలిసి ఎఫీమో మర్నాడు పవిత్రసమాధికి మళ్ళీ వెళ్ళాడు. ముందుకి వెళ్ళాలని అతడు యత్నించాడుగాని, అతణ్ణి వెనక్కి నొక్కేశారు. అందుకని అతడు ఒక స్తంభందగ్గిర మంచుని ప్రార్థనచేసుగున్నాడు. తన ఎదురుగా అతడు చూశాడు. జ్యోతుల దిగువ మిక్కిలి ప్రముఖస్థానంలో, ప్రభుసమాధికికూడా మిక్కిలి సన్నిహితంగా, బలిస్థానం దగ్గిర మతాచార్యుడులాగ బాహువులు సాచి, అద్దంవంటి బట్టతల కాంతి ప్రతిఫలించగా, ఎలీషా నిలబడ్డాడు. ఎఫీమో, 'ఆఁ, సరే, ఈసారి ఇతణ్ణి పోగొట్టుకోను' అనుకున్నాడు. అతడు తోసుగుని ముందుకి పోయాడు. కాని, తీరా అతడు అక్కడికి వెళ్ళగా, ఎలీషాలేడు. అతడు వెళ్ళిపోయుండాలి, అనడానికి మరేంకావాలి? ఎఫీమో మూడోనాడు మళ్ళీ వెళ్ళిచూడగా, సమాధిపక్క పరమపవిత్ర స్థానంలో, జనం అందరి కళ్ళముందూ, బాహువులు సాచి, పైన దేనినో వీక్షిస్తూన్నప్పుడులాగ ఎత్తేఉంచిన నిశ్చలదృష్టితో, బట్టతల నిగనిగా మెరుస్తూ నుంచున్న ఎలీషా కనిపించాడు. అప్పుడు ఎఫీమో 'అబ్బ! ఈసారి ఇతడు నన్ను తప్పించుగు పోలేడు! నేను వెళ్ళి ద్వారందగ్గిర నుంచుంటాను. అలాచేస్తే నేనతణ్ణి తప్పిపోలేను, నన్నతడూ తప్పిపోలేడు' అనుకున్నాడు. అతడు బయటికి వెళ్ళి ద్వారందగ్గిర నుంచున్నాడు—మిట్ట మధ్యాహ్నం దాటేదాకా. ప్రతివాడూ బయటికి వెళ్ళిపోయాడు. అయినాసరే, ఎలీషా కనిపించలేదు. యెరూషలేంలో ఎఫీమో ఆరు వారాలున్నాడు, ప్రతిచోటికీ వెళ్ళాడు,- బెత్లెహేముకి,

జేతనీకి, యోర్దానునదికి! తన సమాధివేళ కప్పేనిమిత్తం ఒక
కొత్త దుప్పటీకొని దానిమీద పవిత్రసమాధి ముద్ర వేయించు
గున్నాడు, యోర్దాను నదిలోంచి ఓపాత్రజలమున్నూ పవిత్ర
మైన మట్టిన్నీ జాగర్త చేసుగున్నాడు. పవిత్రజ్యోతి దగ్గిర
వెలిగించిన కొవ్వొత్తులు కొనుక్కున్నాడు. ఎవరిగురించి ప్రార్థ
నలు జరపాలో ఆపేర్లు ఎనిమిదిచోట్ల లిఖింపించాడు. ఇంటికి
చేరుకోడానికి సరిపడపైకం తప్ప తక్కింది యావత్తూ సెలవు
చేశాడు. తరవాత ఇంటికి పారిపట్టాడు. జాఫాదాకా నడిచే
వెళ్ళాడు. అక్కణ్ణించి ఓడమీద ఒడెస్సా చేరుకున్నాడు. మరి
తన ఇల్లు చేరేవరకూ అతడు కాలినడకనే పోయాడు.

## xi

ఎఫీమో తను ఏదార్ని వచ్చాడో ఆదార్నే వెనక్కి వెళ్ళాడు.
అతడు తన యింటికేసి నడిచినకొద్దీ తన పరోక్షంలో తనయింటి
సంగతులు ఎల్లా జరిగి ఊరుకుంటాయో అనే వెనకటి తాపత్రయం
వచ్చేసి అతణ్ణి మళ్లీ పట్టుగుంది, 'ఏడాదికాలంలో ఎంతనీరైనా
ప్రవహించేస్తుంది' అనగదా సామెత. ఒక యింటిపట్టు నిర్మాణం
చెయ్యడానికి ఒక జీవితకాలం పడుతుంది, కాని దాన్ని ధ్వంసం
చెయ్యడం ఆట్టేసేపు పట్టదు—అని అతడనుకున్నాడు. తను
లేకుండా తనకొడుకు ఎట్లా నిర్వహించాడోగదా అనీ, వసంతకార్తి
ఏరకంగా పరిణమించిందోగదా అనీ, పశువులు శీతకాలం ఎట్లా
తట్టుగున్నాయోగదా అనీ, ప్రారంభంచేసిన యింటియొక్క
నిర్మాణం సరిగ్గా పూర్తిఅయిందో లేదోగదా అనీ అతనికి
ఎంతైనా జిజ్ఞాసపట్టుగుంది. ఎలీషా తనూ విడుడు వేసంగిలో
విడిపోయిన జిల్లాలోకి అతడు వచ్చిచూసి, తనకళ్ళముందు కని
పిస్తూన్న ఆ జనం వెనక నివసిస్తూండే జనమేఅనీ ఎంతమాత్రం

నమ్మలేకపోయాడు. నిరుడు వాళ్లు మలమలా మాడుతూండేవారు, కాని యిప్పుడు అన్నిసదుపాయాలతోనూ జీవిస్తున్నారు. పంట బాగా పండింది; జనం అంతా మళ్లీ కోలుకుని, తమ పూర్వ దుస్థితి మరిచేపోయారు.

ఒక సాయంత్రం ఎఫీమో వెనక ఎలీషా దిగడిపోయిన చోటికే సరిగ్గావచ్చాడు. గ్రామంలో ప్రవేశించగా తెల్లటికమీజు తొడుక్కున్న ఓ చిన్నపిల్ల ఓయింట్లోంచి బయటికిపరుగెత్తుగుని వచ్చి, 'నాన్నా, నాన్నా, మాయింటికి రా' అంది. ఎఫీమో ఉద్దేశం తనదార్ని తను పోవాలనే. కాని ఆపిల్ల అతణ్ణి వెళ్ళ నియ్యందే! అతడికోటు పట్టుగుని, నవ్వుతూ, అతణ్ణి ఆయింటి వేపు లాగింది. ఆవాకిట్లో ఒకస్త్రీ ఒక కుర్రాడూ నుంచునిఉండి రమ్మని అతనికి సంజ్ఞచేశారు. 'రండిరండి, తాతా! ఈరాత్రి ఇక్కడే భోజనంచేసి, మాతో ఉండండి' అని ఆస్త్రీ అంది. ఎఫీమో లోపలికి వెళ్ళాడు. 'పోనీ, ఎలీషావయినంకుడా కను క్కోవచ్చును. మంచినీళ్ళు తాగాలని అతడప్పుడు వెడతా సరిగ్గా ఈయింట్లోకే:' అని అతడు అనుకున్నాడు. ఆయన తన వీపుమీది మూట దింపుగునేటప్పుడు ఆస్త్రీ తనుకుడా పట్టు గునిదింపి, మోహం కడుక్కోడానికి ఆయనకి నీళ్ళిచ్చింది. తర వాత ఆమె ఆయన్ని భోజనానికి కూచోపెట్టి, బల్లమీద పాలూ పెరుగు భక్ష్యాలూ, జావా పెట్టింది. ఏఫీమో అవిణ్ని ఆశీర్వదించి, ఒక యాత్రికుడి యెడల ఆవిడ కనపరిచిన అంతఃకరణకి ఆవిణ్ణి స్తుతించాడు. ఆస్త్రీ తన తల ఇటూ అటూ ఊపింది. 'మేం యాత్రికులకి స్వాగతం ఇయ్యడానికి మంచికారణమే ఉంది. ఒక యాత్రికుడే మాకు జీవితం అంటే ఏమిటో చూపిం చినవాడు. వెనక మేం దేవుణ్ణి మరిచేపోయి ఉంటూంటే,

దేవుడు మాకు వేసిన శిక్ష మరణానికి ఇవతల ఒకేమెట్టు. నిరుడు వేసంగిలో మేం ఎటువంటి ఒరకంలోనేనా ఉన్నాం. అందరికీ వ్యాధే, ఒకరిసాయం ఒకరికిలేదు, ఏసాయమూలేదు, తిండిలేదు. మేం అంతామరణించి ఉండేదే, దేవుడు మా సాయానికి, ఒక ముసిలాయన్ని—సరిగ్గా మీలాంటి ఆయన్నే, పంపి ఉండక పోతే. ఒకనాడు ఆయన తాగడానికి మంచినీళ్ళు అడగాలని వచ్చాడు, మా దుస్థితి చూశాడు, మామీద కనికరం దాల్చాడు, మాదగ్గిర ఉండిపోయాడు, ఆయన మాకు తిండిపెట్టి నీళ్ళుతెచ్చి యధార్థంగా మాకాళ్ళమీద మేం నుంచో గలిగేటట్టు చేశాడు, మా పొలం విడిపించాడు, బండీ గుర్రమూ కొని మాకిచ్చాడు,' అని ఆ స్త్రీ అంది. అప్పుడు ముసలమ్మ ఇంట్లోకి వచ్చి పడు చావిడ మాటకి అడ్డొచ్చి,' ఆయన మనిషో లేక దేవుడు పంపిన దూతో మాకు తెలియదు. మమ్మల్నందర్నీ కనికరించాడు, అందరిమీదా జాలివహించాడు. మాతో తన పేరైనా చెప్పకుండా వెళ్లిపోయాడు, అందుకని మేం ఎవరిగురించి ప్రార్థించాలో తెలియని స్థితిలోకుడా ఉన్నాం. అబ్బే. అదంతా నాకు కళ్ళకి కట్టినట్టుంటేనే! ఇదుగో ఇక్కడ కూచుని ఉన్నాను నేను మర ణాన్ని ఎదురు చూస్తూ! ఆపళంగా, వచ్చాడు లోపలికి, ఒక బట్టతల ముసిలాతడు. చూస్తే ఏముందీ, మరేమీ కాడు. కాసిని మంచినీళ్ళు కావాలన్నాడు. నేను, పాపాత్మురాల్ని గనక, నాలో 'ఎందుకు చెప్మా పొంచి తిరుగుతూ ఇక్కడికి వచ్చాడు వీడూ?' అనుకున్నాను, అయినా, ఆయన ఏంజేశాడో కొంచెం ఊహించుగోండి. మమ్మల్ని చూసీ చూడడంతో ఆయన తన సంచీ ఇక్కడంటే ఇక్కడే దింపుగుని, విప్పాడు.' అంది. ఈ సందర్భంలో ఆ చిన్నపిల్ల కలగజేసుకుని, 'కాదు, నానమ్మా!

ఆయన మొదట తన సంచీ సరిగ్గా మధ్యగా ఇక్కడ పెట్టి, తరవాత ఆదెత్తి బెంచిమీద పెట్టారు' అని సవరణ చేసింది. తరవాత, ఆయన ఏం చెప్పాడో ఏం చేశాడో ఎక్కడ కూచున్నాడో ఎక్కడ నిద్రించాడో ఒక్కొక్కరితో ప్రత్యేకం ఏమి చెప్పాడో వాళ్ళు వాదించుగుంటూ యావత్తూ జ్ఞాపకం చేసుగున్నారు. రాత్రి ఆరైతే తన గుర్రంమీద ఇంటికి వచ్చాడు. వచ్చి, అతడూ చెప్పడం మొదలెట్టాడు ఎలీషాని గురించీ ఆయన తమతో కూడా ఉండడాన్ని గురించీనూ. 'ఆయన వచ్చుండకపోతే, మేమంతా మరణించుండే వాళ్ళమే—అందులోనూ మా పాపాలమధ్య మరణించుండే వాళ్ళం. ఏమంటే, మేం నిరాశలో పడిపోయి దేవుణ్ని మనిషినీకుడా తిట్టిపారేసే స్థితిలో ఉన్నాం అప్పుడు. కాని, ఆయన మమ్మల్ని సార్థకంగా నిలబెట్టాడు. ఆయన ద్వారా మాకు దేవుడంటే ఏముటో తెలిసింది, మనిషిలో మంచితనం ఉందనే నమ్మకం కుదిరింది. దేవుడాయనకి ధన్యత చేకూర్చాలి! అప్పట్లో మేం జంతువులం. మమ్మల్ని పట్టుగుని ఆయన మనుషుల్నిగా చేశాడు,' అని ఆరైతు చెప్పాడు. ఎఫీమోకి ఆహారపానీయాలిచ్చిన తరవాత, ఆయన పడుకోవలిసినచోటు ఆయనకి చూపించి, వాళ్లు తమరుకుడా పరున్నారు. ఎఫీమో పడుకున్నాడే గాని నిద్రపోలేకపోయాడు. అతడు తన మనస్సులోంచి ఎలీషాని తీసపారెయ్యలేకపోయి యెరూషలేంలో ప్రప్రముఖ స్థానంలో నిలబడి ఉంటగా ఎలీషాని తను మూడుసార్లు ఎట్లా చూసి ఉన్నాడో అదంతా జ్ఞప్తికి తెచ్చుగున్నాడు. ఓహో! అల్లాగన్నమాట అతడు నాకంటె ముందు వెళ్లడం! దేవుడు నా యాత్ర అంగీకరించుండచ్చు. అంగీకరించుండకపోవచ్చుగాని, అతడి యాత్ర అంగీకరించుండడం ఖాయం! అని

ఎఫీమో అనుకున్నాడు. మర్నాడు అతడు ఆయింటివారికి సెలవు చెప్పేశాడు. వాళ్ళు తమ పన్లలోకి వెళ్లకపూర్వం కొన్ని మాంసభక్ష్యాలు అతని సంచీలో వేశారు. అతడు బయల్దేరి ప్రయాణం సాగించాడు.

xii

ఎఫీమో యాత్రకి బయల్దేరి సంవత్సరం అయింది. మళ్ళీ వసంతకార్తి వచ్చింది. ఒకసాయంత్రం అతడు తన యిల్లు చేరుకున్నాడు. ఆ సమయానికి అతని కొడుకు ఇంటి దగ్గరలేడు, హోటలికి వెళ్ళాడు. అతడు వెనక్కి వచ్చేశాడు గాని ఒక చుక్క ఎక్కువ పుచ్చుగునే వచ్చాడు. ఎఫీమో వాణ్ణి ప్రశ్నించడం మొదలెట్టాడు. తన తండ్రి ఊళ్ళోలేని కాలంలో ఆపడుచు భడవ అస్థిరంగానే ఉండేవాడనడానికి ప్రతివిషయంలోనూ దాఖలా కనపడింది. సొమ్మంతా దుర్వ్యయంచేసేశారు, పని నిర్లక్ష్యం చేసేశారు. తండ్రి కొడుకుని మందలించడం మొదలెట్టగా, కొడుకు మోటు సమాధానాలు ఇచ్చాడు. 'ఇంటి దగ్గిరుండి పోయి నువ్వే చూసుగోపోయావా ప్రతీపనీ? తుర్రుమని నువ్వు పోవడమూనూ, డబ్బంతా పట్టుగుపోవడమూనూ, అందుకోసం ఇప్పుడు నన్ను నిక్కచ్చి చెయ్యడమూనా?' అని కొడుకు అన్నాడు. కోపంవచ్చి ఎఫీమో తనకొడుకుని కొట్టాడు. మర్నాడు పొద్దున్నే తన కొడుకు ప్రవర్తనగురించి ఫిర్యాదు చెయ్యడానికి ఎఫీమో ఊరి పెద్దయింటికి వెళ్ళాడు. అతడు ఎలీషా యింటికి ఎదటనించి వెళ్ళిపోతూండగా వాకిట్లోంచి ఎలీషా భార్య ఎఫీమో అని హెచ్చరిస్తూ, 'ఇదుగో. ఖులాసాయేనా; ఎప్పుడు

రావడం? క్షేమమా? క్షేమంగా మొరూషరేం వెళ్ళావుగద!' అంటూ పలకరించింది. ఎఫీమో ఆగాడు 'ఆ, దైవ కృపవల్ల, అక్కడికి వెళ్ళాను. కాని, మీ ముసిలాయన దర్శనం పోగొట్టేసుగున్నాను. క్షేమంగా ఇంటికి వచ్చేశాడటగా!' అన్నాడు. ఆ ముసిలావిడికి మాట్లాడ్డం అంటే యిష్టం. అందుకని అమె. 'మరే నేస్తం. ఆయన వెనక్కి వచ్చాడు. వచ్చి చాలాకాలం అయింది. 'నిర్యాణం' పండగ—అనే అనుకుంటాను—వెళ్ళగానే వచ్చేశాడు. అతణ్ణి దేవుడు మళ్లీ మాదగ్గిరికి పంపించాడు గదా అని మేం సంతోషపడ్డాం. అతడు లేనంతకాలమూ మాకు ఉసూరు మంటూఉంది. ఇప్పుడింకా అతడు చాలా పని చేస్తాడని ఆశించలేంగదా మేం! అతని పనికాలం గడిచిపోయింది. కానైతేం. ఇంటి కంతకీ అతడు పెద్ద. అదీగాక, అతడు ఇంటి దగ్గిరుంటూన్నప్పుడు మరీ హెచ్చరికగా ఉంటుంది. మా అబ్బాయి ఎంత సంతోషించాడనుకున్నావు! 'నాన్న లేకపోతే ఏముందీ? ఎండలేకుండా ఉన్నట్టే,' అన్నాడు. అతడు లేకపోతే అంతా స్తబ్దుగా ఉంటుంది, నేస్తం. అతడంటే మాకు అప్యాయం, అతణ్ణి గురించి ఎంత జాగర్తైనా పడతాం,' అంది.

'ఇప్పుడింట్లో ఉన్నాడా?' అని ఎఫీమో కనుక్కున్నాడు.

ఆమె, 'ఉన్నాడు' నేస్తం. తేనెటీగల పని చూస్తున్నాడు. ముసురల్ని పట్టుల్లో ఉంచుతున్నాడు. ఈయేడు ముసురులు బాగా ఉన్నాయని అతడంటున్నాడు. తేనెటీగలకి ప్రభువు ఈయేడిచ్చినంత బలం వెనక ఎప్పుడేనా ఇచ్చుండడం అనేది తనకి జ్ఞాపకం లేదని కూడా మా ముసిలాయన అంటున్నాడు,

'మన పాపాలకి తగ్గ బహుమానం మనికి ప్రభువు ఇయ్యడం లేదు'—అని చెబుతూంటాడు. 'రా, ప్రియనేస్తం, లోపలికి. రా. నిన్ను మళ్ళీ కలియడం అతనికి చాలా సంతోషంగా ఉంటుంది.' అంది ఆమె.

ఎఫీమో పెరటిగుమ్మంలోంచి, ఎలీషాని చూడడానికి ఈగల శాలకి వెళ్ళాడు. ఎలీషా అక్కడఉన్నాడు - బూడిదరంగు కోటు తొడుక్కుని ముఖానికి వలలేకుండా చేతివేళ్ళకి తొడుగేమీ లేకుండా, పైకి చూస్తూ బాహువులు సాచి, బట్టతల నిగనిగా మెరుస్తూ, పేపచెట్లకింద నుంచునిఉన్నాడు—యెరూషలేంలో పవిత్రసమాధి దగ్గిర ఎఫీమో చూసినప్పు డెల్లాఉన్నాడో అల్లాగే! ఎటొచ్చీ ఇప్పుడతనికి పైన చెట్లఆకుల్లోంచి సూర్యరశ్మి ప్రకాశిస్తోంది, పూర్వం ఆ పవిత్రస్థానంలో జ్యోతులు ప్రకాశించినట్టు. పైగా, ఆ బంగారు తేనెటీగలు అతని తలచుట్టూమూగి అతనికి ఓ కాంతి కిరీటం పెట్లాయి, అతణ్ణి కుట్టకుండా! ఎఫీమో ఆగిపోయాడు. ముసిలావిడ తన భర్తతో, 'ఇడుగో, మీనేస్తం వచ్చాడు,' అంది. తృప్తికనపడే మొహంతో ఎలీషా తిరిగి చూసి, ఎఫీమోకేసి నడిచివెడుతూ తనగడ్డంలో చిక్కుగున్న ఈగల్ని మెల్లిగా తీసిపారేశాడు.

ఎలీ—'సుదినం, నేస్తం! సుదినం, ప్రియనేస్తం, అక్కడికి క్షేమంగా వెళ్ళావా?

ఎఫీ—అక్కడ నాపాదాలు నడిచాయి. యోర్దాను నదిలోని జలం పట్టుగొచ్చాను, నీ కోసం. ఒకసారి నువ్వందుకోసం మా యింటికి రావాలి. కాని, నాయత్నాల్ని ప్రభువు స్వీకరించాడో....

ఎలీ—సరే సరే. ప్రభువుని ఎల్లప్పుడు మొక్కుదాం. క్రీస్తు నిన్ను ధన్యుణ్ణి చెయ్యాలి.

ఎఫీ—(ఒక్కక్షణం ఊరుకుని) నాపాదాలు అక్కడి స్థలం మీద నడిచాయి. నా ఆత్మ అక్కడ ఉండడం రూఢి అనడం కంటె, మరొకరి ఆత్మ అక్కడ ఎక్కువ రూఢిగా....

ఎలీ —అబ్బెబ్బే! అది దేవుడిపని, నేస్తం, దేవుడి పని.

ఎఫీ—తిరుగు ప్రయాణంలో, నేనాగాను, ఆ యింటి దగ్గిర, వెనక నువ్వు దిగడ్డావే...

ఎలీ—(హడిలిపోతూ తొందర తొందరగా) దేవుడి పని, నేస్తం, దేవుడిపని. ఇంట్లోకి, రా. మా తేనె కొంచెం ఇస్తాను.

అంటూ ఎలీషా విషయం తప్పించేసి, ఇంటి సంగతులు మాట్లాడాడు. ఎఫీమో నిట్టూర్పు పుచ్చాడు. ఆ మంచినీళ్ళగురించి వెళ్ళిన యింట్లోని జనంగురించిగాని, యెరూషలేంలో తను అతణ్ణి చూసిఉన్న సంగతిగాని ఎఫీమో ఎలీషాతో చెప్పలేదు. దేవుడి ఎదుట మొక్కుగున్న మొక్కులు చెల్లించుగోవాలన్నా దేవుడి ఇచ్ఛచొప్పున ఆచరించాలన్నా ఉత్తమోత్తమమైన మార్గం ఏమిటంటే మానవుడు తన జీవితకాలమంతా కనికరం కనపరుస్తూ ఇతరులకి మేలుచేస్తూ ఉండడమే—అని అతనికి ఇప్పుడు బోధపడింది.



# భ మి డి పా టి కా మే శ్వ ర రా వు గా రు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు-కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ. జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ, 'త్యాగరాజ ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ రాయలసీమలోనూ నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.

